# నేటి మంచి మాటలు

## (మనలో మార్పుకోసం)

Complied By:

తెలుగు భాష సంరక్షణ వేదిక

www.telugusamrakshanavedika.com

Publishers:

రామ్ కర్రి పబ్లికేషన్స్.

రాయవరం, ఆంధ్రప్రదేశ్, ఇండియా – 533346

Phone: 8096339900 , 9985228800, 9492089900

www.ramkarri.com



నేటి మంచి మాట

" జీతం కోసం ఆరాటపడకు
జీవిత సత్యం తెలుసుకో "

www.ramkarri.com

www.ramkarri.com



# నేటి మంచి మాట

ఆకలి విలువ కాలే కడుపుకి
ప్రేమ విలువ గాయపడ్డ మనసుకి
కన్నీటి విలువ నిజాయితీకి
మనిషి విలువ కష్టాల్లో ఉన్నవాడికే తెలుసు.

హృదయమే ఉత్తమ బోధకుడు ..
కాలమే ఉత్తమ గురువు..
ప్రపంచమే ఉత్తమ గ్రంథం..
భగవంతుడే ఉత్తమ స్నేహితుడు..!!



నేటి మంచి మాట

www.ramkarri.com



## నేటి మంచి మాట

మంచి వారిని బాధ పెడితే
తాత్కాలికంగా సంతోషం కలిగినా
శాశ్వతమైన బాధ జీవితంలో
మిగిలిపోతుంది...




నేటి మంచి మాట





రేపటిపై ఆశ లేకపోతే నిన్నటి నిరాశకి అంతం లేదు,
నిన్నటి నిరాశకి కారణం లేకపోతే రేపటి ఆశకి పునాది లేదు
www.ramkarri.com



www.ramkarri.com

నేటి మంచి మాట

ఆడపిల్ల తను తలవంచుకుని
నడవవలసిన పనిలేదు
తన కన్నతల్లిదండ్రులు
తలవంచుకునేలా
ప్రవర్తించకుండా ఉంటే చాలు





నేటి మంచి మాట

విద్య వలన వినయం పెరుగును
విద్య వలన విజ్ఞానం పెరుగును
విద్య వలన వివేకం పెరుగును
కాని విద్య వలన అహంకారం
పెరిగినచో వినాశనం జరుగును

ఒక వ్యక్తిని త్వరగా అర్థం
చేసుకోకపోయినా ఫర్వాలేదు,
కానీ అతిత్వరగా అపార్థం
మాత్రం చేసుకోవద్దు.



నేటి మంచి మాట

www.ramkarri.com

పేదవారు మొదటివరుసలో

కూర్చునేది

ఒక్క సినిమాహాల్లోనే





నేటి మంచి మాట

# సలహా అనేది

నీ స్నేహితులను కేవలం

సంతోషం పెట్టేదిగా కాదు.

సహాయపడేదిగా ఉండాలి.

వేల కొలది మిత్రులుండడం అద్భుతం కాదు...
ఏ సమస్యనైనా తీర్చగల మిత్రుడుండడం అద్భుతం!
ఏ సమస్య దరి చేరనీయని మిత్రుడుండడం
ఇంకా అద్భుతం!!



నేటి మంచి మాట



# నేటి మంచి మాట

తప్పదు ,
గాలి
కోసం కిటికీ తెరిస్తే ఒక్కోసారి
ధూళి
రావొచ్చు !
అలాగని తలుపులు బిడాయించుక్కూర్చుంటామా ?



www.ramkarri.com



## నేటి మంచి మాట

# అసాధ్యమైన పనిని ఎలాగైనా సాధించవచ్చు. కానీ... మూర్ఖుని మనసుని బ్రహ్మ కూడా మార్చలేడు.

* మంచి మాట *

*దనవంతుడు తన ధనంతో మరణం రాకుండా చేసుకోగలడా?*

*పోనీ బలవంతుడు తన బలంతో మరణాన్ని ఆపుకోగలడా ?*

*తెలివిగలవాడు తన తెలివితో మరణం తప్పించుకోగలడా?*

*పోనీ వైద్యుడు తనకు తెలిసిన వైద్యంతో మరణించకుండా ఉండగలడా?*

*లేదు కదా మనం బ్రతికినన్ని రోజులు మన కుటుంబసభ్యులతో,*
*స్నేహితులతో,బంధువులతో కష్టసుకాల్ని పంచుకుందాం......!స్వార్థాన్ని వీడి మనుషులుగా జీవిద్దాం*

# ఆలోచింపచేసే 3 చిన్న విషయాలు

ఒక పల్లెలో వర్షం కోసం పూజలు చేయడానికి
అందరూ వెళ్ళారు.ఒక్కరు మాత్రం గొడుగు
తీసుకొని వెళ్ళాడు.దాని పేరే.....**FAITH**

తండ్రి తన బిడ్డను పైకి ఎగరేసి పట్టుకుంటూ
ఉన్నప్పుడు కూడా, ఆ బిడ్డ భయపడకుండా
నవ్వుతుంది. దాని పేరే.....**TRUST**

తెల్లారేసరికి మనం బ్రతికి ఉంటామో లేదో
తెలియదు.కానీ, రాత్రి అలారం పెట్టుకొని
పడుకుంటాం.దాని పేరే.....**HOPE**



నేటి మంచి మాట

జీవితం Online

ప్రేమ Offline



నేటి మంచి మాట

మనసనేది ఎప్పుడూ Pending

బాధలనేవి ఎప్పుడూ Updating

సమస్యలనేవి ఎప్పుడూ Incoming

డబ్బు అనేది ఎప్పుడూ Out going

కానీ నేనెప్పుడూ Working

సంతోషం మెల్లమెల్లగా Downloading

ఈ జీవితంలో నా ప్రియ నేస్తం అమ్మ
ఆమే లేకుండా ఉండేదా ఈ జన్మ
అందుకే తల్లి ఋణం తీర్చలేం
ఆమెకు ఈ జన్మ అంకితం
సదా కన్న తల్లి దేవత
ఈ జీవితానికి ఆమే విధాత





నేటి మంచి మాట

నీకు కావాల్సిన వ్యక్తి కోసం
వెతకవద్దు
నువ్వు కావాల్సిన వ్యక్తి కోసం
వెతుకు

# గీతా సారాంశం

గత మంతా మంచే జరిగింది.

వర్తమానం కూడా మంచే జరుగుతోంది.

భవిష్యత్తు కూడా మంచే జరుగుతుంది.

నువ్వు ఏం పోగొట్టుకున్నావని అంతలా దుఃఖిస్తున్నావు

నువ్వు పోగొట్టు కొన్న దానిని నువ్వు సృష్టించలేదు.

నువ్వు అనుభవిస్తున్నదంతా ఇహలోక సంపదే.

నువ్వు అనుభవించే ఈ భోగం నిన్న వేరొకరి సొత్తు.

నేడు నీదిగా అయింది.

రేపు వేరొకరి స్వంతం అవుతుంది.

మార్పు అనేది ప్రకృతి సహజధర్మం.



నేటి మంచి మాట

www.ramkarri.com

www.ramkarri.com

జీవితంలో

సంతోషం కావాలంటే

నిన్ను నువ్వు ప్రేమించు

కానీ

సంతోషమే జీవితంగా

ఉండాలంటే

నిన్ను ప్రేమించే వారిని

నువ్వు నిజంగా ప్రేమించు



నేటి మంచి మాట

www.ramkarri.com

www.ramkarri.com

ప్రభుత్వ పాఠశాలలు బాగుపడాలంటే

మంత్రుల పిల్లలను

ప్రజా ప్రతినిధుల పిల్లలను

ప్రభుత్వ టీచర్ల పిల్లలను

చేర్పించండి



నేటి మంచి మాట

www.ramkarri.com

అవసరం క్రమశిక్షణని ఆటోమేటిక్ గా నేర్పిస్తుంది .......



నేటి మంచి మాట



www.ramkarri.com

మనం కన్నుమూస్తే మన చుట్టూ
ఉన్నవారి గుండె క్షణం పాటు ఆగిపోవాలి
గుండె బాధతో బరువెక్కాలి
ఊరంతా చిన్నపోవాలి
అదీ బ్రతుకంటే



నేటి మంచి మాట

## చక్కగా హాయిగా నవ్వితే :

గుండె వేగం పెరిగి రక్తప్రసరణ బాగుంటుంది.
చిన్నవయస్సులో 300 సార్లు,
యుక్త వయస్సులో 47 సార్లు,
వృద్ధాప్యంలో 20 సార్లు నవ్వాలి.
గలగలా నవ్వటం వలన జ్ఞాపకశక్తి
పెరుగుతుంది. ధైర్యగుణం వస్తుంది.
రక్తపోటు తగ్గుతుంది.
చక్కెర వ్యాధికి నవ్వు చక్కని మందు.
దివ్య ఔషధం.



నేటి మంచి మాట

# A Message from your HEART!

www.ramkarri.com

ఈ రోజు ఉదయం నాకు
గుండె నుండి ఫోన్ వచ్చింది.
ఇలా చెప్పడం మొదలుపెట్టింది:
బాస్
నేను నీ కొరకు, ఆగకుండా
ఇరవైనాలుగు గంటలు నడుస్తూనే ఉంటాను
అయితే నువ్వు నా కొరకు
ఒక గంట కూడా నడవవు.
ఎప్పటిదాకా ఇలా చేస్తావు
నేను కనుక ఆగిపోతే నువ్వు పోతావు
ఇక నువ్వు ఆగిపోతే నేను పోతాను
ఓ పని చేద్దాము, కలిసిమెలిసి నడుద్దాము మరియు
కలిసిమెలిసి జీవిద్దాము.
జీవితాంతం బాస్
ఇప్పటికీ సమయం మించిపోలేదు
రేపటి నుండి రోజుకు కేవలం ఒక గంట నా కొరకు నడువు
నా వాగ్దానం నేను ఎలాంటి ఆటంకం లేకుండా
24 గంటలు నడుస్తూనే ఉంటాను.

మీ మీ గుండె...♥





నేటి మంచి మాట



# ఉపవాసంతో ఏమిటి లాభం?



## మంచి పెరుగుతోంది..

- ఆయుర్దాయం పెరుగుతోంది
- ఒంట్లో ఇన్సులిన్‌ను గ్రహించే స్వభావం మెరుగవుతోంది
- రక్తంలో గ్లూకోజు నిల్వలపై నియంత్రణ పెరుగుతుంది
- ఒత్తిడిని, వ్యాధులను తట్టుకునే శక్తి పెరుగుతోంది
- ఏకాగ్రత, మెదడు పని తీరు మెరుగవుతున్నాయి
- వృద్ధాప్య ఛాయలు త్వరగా దరిచేరటం లేదు
- ఆకలిపై నియంత్రణ మెరుగవుతుంది




## చెడు తగ్గుతోంది..

- అధిక రక్తపోటు (హైబీపీ) వెనకంజ వేస్తోంది
- పెద్దపెద్ద వ్యాధులకు మూలమైన 'వాపు స్వభావం' తగ్గుతోంది
- ఒంట్లో పేరుకున్న కొవ్వు కరగటం మొదలవుతోంది
- ట్రైగ్లిజరైడ్లు, చెడ్డ కొలెస్ట్రాల్ అదుపులోకి వస్తున్నాయి
- కణాలను దెబ్బతీసే 'ఆక్సిడేటివ్ స్ట్రెస్' తగ్గుతోంది, తద్వారా క్యాన్సర్ ముప్పు తగ్గుతోంది
- రుమటాయిడ్ ఆర్థ్రైటిస్ వంటి 'ఆటోఇమ్యూన్' సమస్యలు తగ్గుముఖం పడుతున్నట్టు స్పష్టంగా గుర్తించారు

ప్రేమ విలువ తెలియనివారిని
ప్రేమించకు
వారి ప్రేమ కోసం నువ్వు
చేసే ఏ ప్రయత్నం



నేటి మంచి మాట

ఆయినా
వారి ధ్రుష్టిలో వ్యర్థమైనదే
ఎందుకంటే వారు నీపై
చూపలేని ప్రేమను
వారిపై నువ్వు చుపుతున్నావని
అలుసుగా బావిస్తారు



www.ramkarri.com



నేటి మంచి మాట

'గొప్పతనం' అనేది
సెల్ఫ్ డబ్బా కొట్టుకుంటే రాదు.
మనం చేసే పని, నడుచుకునే పద్ధతిని
బట్టి దానంతట అదే వస్తుంది.







# మూ డు మా ట లు

మూడు విషయాలు ఎవరి కోసం ఆగవు

**సమయం, మరణం, వినియోగదారుడు**

మూడు విషయాలు జీవితంలో ఒకేసారి లభిస్తాయి

**తల్లి, తండ్రి, యువ్వనము**

ఈ ముగ్గురిని పూజించవలెను

**తల్లి, తండ్రి, గురువు**

మూడు విషయాల నుంచి రక్షింకొనుటకు ప్రయత్నించా

**చెడు స్నేహాలు, స్వార్థము, విమర్శ**

మూడు విషయాలను గుట్టుగా ఉంచాలి

**ధనము, స్త్రీ, భోజనం**

మూడు విషయాలను ఇతరులెవరు దొంగలించలేరు

**తెలివితేటలు, చరిత్ర, నైపుణ్యం**

ఈ మూడింటిపట్ల ఎల్లప్పుడు జాగ్రత్త వహించాలి

**కామము, లోభము, మదము**

మూడు విషయాలను ఎప్పటికి మరువకూడదు

**ఋణం, బాధ్యత, వ్యాధి**

మూడు విషయాలపై మనసు పెడితే ప్రగతి సాధిస్తారు

**దేవుడు, శ్రమ, విద్య**

ఈ ముగ్గురిపై ఎప్పుడు దయచూపాలి

**పిల్లలు, ఆకలిగ్రస్తులు, పిచ్చివాడు**



# నేటి మంచి మాట

ఒక బంతిని ఎంత తొక్కితే అంతగా పైకి లేస్తుంది.
ఒక వ్యక్తిని ఎంతగా అణగదొక్కాలని చూస్తే అంతగా బలపడతాడు.

ఇంకొకరికోసం గొయ్యితోడితే, అందులో పడేది తోడినవారే.
పగ,కుట్ర,కుతంత్రాలు మొ॥తో నష్టమే తప్ప,లాభం లేదు.

ఆవేశం కంటే ఆలోచన వెయ్యిరెట్లు గొప్పది.

పుట్టినప్పుడు ఎవ్వరూ చెడ్డవారు కాదు.
పరిస్థితులే వారిని మంచివాళ్ళుగా,చెడ్డవాళ్ళుగా,గొప్పవాళ్ళుగా....
మార్చుతాయి.



నేటి మంచి మాట

జీవితంలో ఎపుడు మంచి
మనుషులను నొప్పించకు
ఎందుకంటె వాళ్ళు వజ్రం
లాంటి వాళ్ళు. చేజారితే
పగిలిపోరు నీ జీవితం
నుండి జారి పోతారు



## నేటి మంచి మాట

చెట్టునీ, పుట్టనీ ప్రేమించగలగాలి. వర్షాన్ని,
మంచునీ ప్రేమించగలగాలి.
మేఘమొస్తుంటే సంతోషించాలి.
పువ్వు పూస్తుంటే మైమరచిపోవాలి
అదీ ప్రేమంటే. ........................
విశ్వాన్ని, ప్రకృతిని, సాటి మనిషినీ
ప్రేమించేవాడి మనసు నుంచి ఆనందాన్ని,
పెదవి మీద నుంచి చిరునవ్వుని
ఎవరు చెరపలేరు.



www.ramkarri.com



www.ramkarri.com

# జీవితంలో 4X3 తెలుసా...!

**1 వచ్చేది పోయేది మూడు**

1. పేదరికం 2. వ్యాధి 3. డబ్బు

**2. వచ్చిన వదవిపోనివి మూడు**

1. కీర్తి 2. జ్ఞానం 3. విద్య



నేటి మంచి మాట

**3. పోతే రానివి మూడు**

1. కాలం 2. యవ్వనం 3. పరువు

**4. వెంటవచ్చేవి మూడు**

1. పాపం 2. పుణ్యం 3. నీడ



www.ramkarri.com



నేటి మంచి మాట

అలలే బండరాళ్ళకి ఓ
రూపం ఇవ్వగలిగినప్పుడు
నీ ఆశలకు నీ పట్టుదల
రూపం ఇవ్వలేదా



మసక బారుతున్న చూపుల వెలుగు... కొడిగట్టే దీపం
గతానికీ వర్తమానానికీ
కాలం కట్టిన సేతువు
మధురమైన మన
సంస్కృతికి జీవధాతువు
వృద్ధాప్యం!



నేటి మంచి మాట





నిజమైన స్నేహితుడు..నీ ముందు నిజం
మాట్లాడి బాధ పెట్టినా..నీ వెనుక నిను గౌరవిస్తాడు
ఓ చెడు స్నేహితుడు..నీముందు
ప్రేమగా నటిస్తారు..ఆ కపట ప్రేమలో స్వార్థాన్ని నింపి
నిను కోలుకోలేనంతగా నాశనం చేస్తాడు..





# పాత పదాలు - కొత్త అర్థాలు



రోకులు : ఒరిజినల్ కాకులు

ఆశ : పుట్టడం తేలిక ... రావడం కష్టం

రెస్టారెంటు : రెస్టు తక్కువ... రెంటు ఎక్కువ

కెమెరా : అందరికీ నిర్భయంగా కన్నుకొట్టేది

నిజమైన స్నేహం : వెల కట్టలేనిది...వేలలో ఒకరిది

విందు : ఇచ్చేవారికి "క్యాష్‌ట్రబుల్" - పుచ్చుకొనే వారికి "గ్యాస్ ట్రబుల్"

అప్పు : తీసుకున్నవారికి "హ్యాపీ" ... ఇచ్చిన వారికి "బీపీ"

నిజమైన క్రికెటర్ : తినమని ఏ కాయ ఇచ్చినా దానిని ప్యాంటుకు రుద్దుకొని తినేవాడు.

సమాజం : ధనమున్నప్పుడు మనలోని లోపాల్ని కప్పిపుచ్చేది. లేనపుడు మనలోని లోపాల్ని విప్పిచెప్పేది.

టి.వి. : తలనొప్పి తెప్పించి, తగ్గడానికి ఏ మాత్రలు వేసుకోవాలలో ప్రకటనలలో చూపించేది.

ప్రభుత్వ ఆఫీసు : మామూలుగా జరగాల్సిన పనులు "మామూలు"తో జరిగేచోటు.

మోటారు సైకిల్ : కొన్నప్పుడు షోరూం ఓనరును, ఎక్కించుకొన్నప్పుడు భార్యని, పడ్డప్పుడు వైద్యుడ్ని సంతోషపెట్టేది.



అడుక్కు తినైనా బ్రతుకు కాని
అయిన వాళ్ళ దగ్గర మాత్రం
ఆర్ధికసహాయం అందుకోకు



నేటి మంచి మాట



తెలుసా!

సూర్యకిరణాలు 



భూమికి చేరడానికి

8 నిమిషాల...20

సెకెన్లు మాత్రమే

పడుతుంది.

నేటి మంచి మాట

"మీరంటే ఇష్టపడే వారిని
'Mis Use' చేయవద్దు
మీ అవసరం ఉన్న వాళ్ళ దగ్గర
'Busy' గా ఉన్నానని చెప్పవద్దు
మిమ్మల్నే నమ్మిన వాళ్ళను
మోసం చేయవద్దు...
మిమ్మల్నే తలచుకునే వారిని
మరచిపోవద్దు...."



నేటి మంచి మాట

ఎదిగే వయసుతో వచ్చిన
అనుభవం నలుగురికి
చెప్పేదిలా ఉండాలి కాని
ఒకరితో చెప్పించుకునేలా
ఉండకూడదు



నేటి మంచి మాట



www.ramkarri.com

www.ramkarri.com



మనిషి జీవితంలో 'యుద్ధం' అనివార్యం. అవసరాల కోసం... అవకాశాల కోసం... గుర్తింపు కోసం... బంధాల రక్షణ కోసం... బాధ్యతల నిర్వహణ కోసం... సమరం సాగించాల్సిందే. ఇలా మనిషి జీవితం నిత్య కురుక్షేత్రం. సరిగ్గా ఇలాంటి యుద్ధంలోనే భగవద్గీత ఉద్భవించింది!

యుద్ధం ఓ సదవకాశం అంటాడు భగవానుడు. యుద్ధం జరిగితేనే కదా ఎవరి బలాబలాలు ఏంటో బయటపడేది. యువతకి ఇంతకంటే స్ఫూర్తి ఇంకేం కావాలి!

మనో దౌర్బల్యం నీచం. దాన్ని విడిచిపెట్టు. అప్పుడే నువ్వు శత్రువులపై విజయం సాధించగలవు' అంటూ భగవానుడు బోధిస్తాడు. ఈతరం యువత ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలకి మూల కారణం మనోదౌర్బల్యం. దాన్ని విడిచిపెడితే విజయమే.




కోపం వల్ల అవివేకం, అవివేకం వల్ల మరుపు, మరుపుతో బుద్ధినాశనం, బుద్ధినాశనంతో మనిషే నాశనం అంటాడు భగవానుడు. ఇది తెలిస్తే చాలు... వేరే యాంగర్ మేనేజ్‌మెంట్ అంటూ ఇంకేం ఉంటుంది!

నేటి యువతరం ఎదుర్కొంటున్న
ఏ సమస్యకైనా పరిష్కారం భగవద్గీతలో ఉంది.
ఏ పనిని ఎప్పుడు ఎలా చేయాలో అలా
చేయడం... ఏది చేయకూడదో అది
చేయకుండా ఉండటం ఇది నేర్పుతుంది.

చలికాలంలో ఎండాకాలపు చికాకు, వానాకాలపు చీదర రెండూ ఉండ
అయితే, ఈ కాలం ప్రవేశించగానే నీళ్లు తాగాలనిపించదు. కాళ్లు పగులుతాయి, పెదవులు చిట్లుతాయి, చర్మం పొడిబారి ఇర్రిర్రు మంటుంది, పగిలిన పెదాలు నోరారా నవ్వడానికి అడ్డుపడతాయి. అయినప్పటికీ- కౌగిలి మరింత వెచ్చగా ఉంటుంది. ఊపిరి మరింత ప్రియంగా ఉంటుంది. పెదాల వణుకుల్లో సంగీతం వినబడుతుంది. సాయంగాలులు చక్కిలిగిలి పెడుతాయి. అన్నం తుకపెక ఉడుకుతుంటే హాయిగా ఉంటుంది. ఆకలి మరింత బాగా వేస్తుంది. అన్నం మరింత రుచిగా ఉంటుంది. పొద్దున ఉడకేసుకున్న అన్నం మాపటికి కూడా పాడుకాకుండా ఉంటుంది. కూరగాయలు తాజాగా ఉంటాయి. మధువు మరింత ప్రియమవుతుంది. ఆకాశం మరింత స్వచ్ఛంగా ఉంటుంది. సూర్యోదయం మరింత సంతోషాన్నిస్తుంది. వెన్నెల మరింత బాగుంటుంది. చెవిలో మాట్లాడటానికి ప్రత్యేకంగా చేరువ కావాల్సిన పనిలేదు. బంధాలకు 'పునరంకితం' కావడానికి కాలం కల్పించిన మాయ ఆట ఇది. మనుషుల మధ్య దూరాల్ని పెరగకుండా ఉంచేందుకు సృష్టి వేసిన ఎత్తుగడ ఇది. సౌందర్యాన్ని చూడక దుమ్ము పడిన కళ్లను శుభ్రం చేయడానికి ప్రకృతి కట్టిన చీపురు ఇది.



నేటి మంచి మాట



మాటకు ఎంతో శక్తి ఉంది. కాలుజారితే
ఏమి కాకపోవచ్చు కానీ నోరుజారితే తీసుకోలేము.
ఒక మాట ఒక జీవితాన్ని కూలదోయవచ్చు. నాలుక కేవలం
ఆహారాన్ని గ్రహించుటకే కాదు, వాక్కు కూడా దానికి ఆహారమే.
అందుకే ''మంచి మాటలు చాలు మనసు గాయంబు మాన్పజాల
గొప్పమంచు వోలె'' అన్నాడొక మహాకవి. మంచి మాట కామధేనువు
లాంటిది. భర్తృహరి అన్నట్లు తారాహారాలు, సుగంధ జలాభిషేకాలు,
ఇతరభూషణాలన్నీ నశించవచ్చు కానీ వాక్కు నశించదు. వ్యక్తిని
ఎల్లప్పుడు అలంకరించి ఉండే భూషణం వాక్కుమాత్రమే.
వినయంతో కూడిన మాటలతో విశ్వాన్నే జయించవచ్చు.
అందుకే మాటతో ''బహుపరాక్''.



నేటి మంచి మాట

www.ramkarri.com



నేటి మంచి మాట



చీకటి మంచిదే

వెలుగు విలువని చూపెడుతుంది

మితం మంచిదే

అతిలో మతిని మందలిస్తుంది

గుండెల్ని మీటేది మాటలే..
గుప్పిట బిగించేది మాటలే..
గువ్వలా ఒదిగి పోయేది మాటలే..

మాటలు మనసు దోచేస్తాయి..
హృదయాల మీద పూల
సంతకం చేస్తాయి..



నేటి మంచి మాట



మౌనం గొప్పదే కాదనలేం కానీ
మాటలు కొండంత అండను ఇస్తాయి..
చెరిగిపోని స్ఫూర్తినిస్తాయి...

జీవితంలో చాలా గొప్ప
సంతోషాన్నిచ్చేవి
అనుకోకుండా లభిస్తాయి
ఎందుకంటే అవి
ఆశించకుండా వచ్చినవి.





నేటి మంచి మాట

www.ramkarri.com



నేటి మంచి మాట

జ్ఞాపకాలు ఎప్పటికీ చెరిగిపోవు,
జీవితమంతా మన నీడలా ఉంటాయి.
గడిపే జీవితానికి గడిచిపోయిన
జీవితానికి వంతెనలా నిలుస్తాయి.
ప్రతీక్షణం మనసుని
తాకుతూనే ఉంటాయి.
కొన్ని ముల్లులా గుచ్చుకుని
బాధ పెడితే మరికొన్ని -
మది ఆనందంతో
ఉప్పొంగేలా చేస్తాయి.

www.ramkarri.com

తీరికే లేని విశ్వ సంసారమందు
అలసి పోయితివేమొ దేవాదిదేవ
ఒక నిమేషమ్ము కన్ను మూయుదువు గాని
రమ్ము! తెరచితి మా కుటీరమ్ము తలుపు



## నేటి మంచి మాట

ఎంత చక్కటి పద్యం ... మామూలు సంసారినికే సతమతమయిపోయి విశ్రాంతి కోసం వెంపర్లాడుతున్నామే మనం, తీరికలేని విశ్వ సంసారమందు ఎంత అలసిపోయి ఉన్నాడో గదా ఆ జగదీస్వరుడు. ఓ విశ్వసంసారి ...మురారీ.. ఒకసారి.... మాత్రమే మా ఇంటికి వచ్చిపో.... చాలు ప్రభో .... ఆ విశ్వసంసారికి తీరిక దొరికిన సమయంలో మన హృదయ కుటీరంలో విశ్రమించడానికి వస్తాడేమో ఎందుకైనా మంచిది అంతర్యపు ద్వారం తెరిచి ఉంచటమే మంచిది మరి .....





కష్టాల్లో ఉన్నప్పుడు
మిత్రుల మనస్తత్వాలు,
వృద్ధాప్యంలో ఉన్నప్పుడు
బిడ్డల మనస్తత్వాలు,
పేదరికంలో ఉన్నప్పుడు
బంధువుల మనస్తత్వాలు
బయటపడతాయి.



నేటి మంచి మాట

www.ramkarri.com

www.ramkarri.com

మనసు నిర్మలంగా ఉంటే..
జీవితం ఆహ్లాదకరంగా
ఉంటుంది.





నేటి మంచి మాట

www.ramkarri.com

www.ramkarri.com



స్నేహ బంధం అయినా..
రక్త బంధం అయినా..
ధనంతో ముడిపడనంత వరకు..
బాగుంటాయి...



నేటి మంచి మాట

www.ramkarri.com



మన గొప్పతనం ఎప్పుడూ క్రింద పడకపోవడంలో లేదు;

పడిన ప్రతిసారీ తిరిగి పైకి లేవడంలో ఉంది.

ప్రయత్నించి సాధించు.





నేటి మంచి మాట



నీకు అందని దాని కోసం ఆశపడకు
నీకు నచ్చని దాని కోసం కష్టపడకు
నీకై కష్టపడే వారిని మరచిపోకు
నిన్ను ఇష్టపడే వారిని వదులుకోకు..!



నేటి మంచి మాట

www.ramkarri.com



జీవితం కడలిపైన పయనించే నావ ఐతే, ఎగసిపడే
కెరటాలను జీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులు.
ఏ అలలో ఏ బలముందో,
ఏది ఏం మలుపు త్రిప్పుతుందో? చెప్పడం కష్టం.
కొన్ని అలలు ఒడ్డుకు చేర్చితే,
మరికొన్ని అగాధంలోకి తోస్తాయి.

శుభ దినం



విశాఖ సముద్రపు అందాలు మేఘమథనం చేసే
ఎన్నెన్నో జ్ఞాపకాలు కెరటాలై గుండె లోతులను తాకే
www.ramkarri.com
నేటి మంచి మాట



కష్టపడకుండా
పెరిగేది కలుపొక్కటే..



నేటి మంచి మాట





www.ramkarri.com





# నేటి మంచి మాట

నువ్వు ఈ రోజుని
నిన్నటి కన్నా బాగా
ఉపయోగించకపోతే
నీకు రేపటితో అవసరం
ఏముంది ?

ఈ ప్రపంచంలో కష్టమయిన
పని అంటూ ఏది లేదు.



నేటి మంచి మాట



మనకి అదంటే ఇష్టం లేకపోవటం వలన
అది 'కష్టం'గా మారుతుందంతే.



www.ramkarri.com



# నేటి మంచి మాట



డబ్బు అనేది పంచిన కొద్ది తరిగి పోతుంది,
ప్రేమ అనేది పంచిన కొద్ది పెరుగుతుంది...



# నేటి మంచి మాట



ఉత్తముడు ఎప్పుడు
సంతోషంగానే ఉంటాడు...
వివేకవంతుడు ఎన్నడు
చిక్కుల్లో పడడు...
సాహసవంతుడు ఎన్నడు
భయపడడు...



www.ramkarri.com

తెలివి మాట్లాడుతుంది.

వివేకం వింటుంది.





నేటి మంచి మాట

భగవంతుడు మనకు రెండు చేతులెరుకిచ్చాడో తెలుసా ?
ఒక చెయ్యి మనకు మనం సహాయం చేసుకునేందుకు,
రెండవ చెయ్యి పరులకు సహాయపడేందుకు !





నేటి మంచి మాట

మార్పును చెయ్యి పట్టుకుని స్వాగతించకపోతే అది



మన వెంట పడి పట్టుకుని



తన వెంట తీసుకెళుతుంది.

నేటి మంచి మాట

శుభోదయం

కంసాలి ఒక వెండి రేకుని నిప్పులమీద కాల్చటం చూసి ఒక స్త్రీ అడిగింది.
మంట మీద అలా కాల్చటం ఎందుకని. వేడి ఎక్కువగా ఉండే మంట
మధ్యలో వెండిని ఉంచాలని అపుడే అందులోని మాలిన్యమంతా
తొలగిపోతుందని కంసాలి వివరించాడు. అప్పుడా స్త్రీ అతన్ని,
"ఆ వెండిలోని మాలిన్యం పూర్తిగా ఎపుడు తొలగిపోతుందో మీకెలా
తెలుస్తుంది? అని అడిగింది. అతను నవ్వి "ఓ అది చాలా తేలిక...
ఆ రేకులో నా ప్రతిబింబం కనిపించినప్పుడు" అని అన్నాడు.
మీ జీవితంలో మీరు వేడిని(కష్టాలని) అనుభవిస్తూ ఉంటే,



దేవుడి కళ్ళు మిమ్మల్నే చూస్తున్నాయనీ,
తన ప్రతిబింబాన్ని మీలో చూసుకోనేదాకా
అయన ధ్యాసంతా మీమీదే ఉంటుందనీ
గుర్తుంచుకోండి. ఈ జీవితం మిమ్మల్ని
కాల్చివేసే కొలిమి కాదు, మిమ్మల్ని మెరిసే
వెండిలా తయారుచేసేందుకే మీకు అది దొరికింది.



నేటి మంచి మాట



శుభోదయం

జీవిత లక్ష్యాలు రెండు.

1. కోరుకున్న దానిని సాధించడం

2. సాధించిన దానిని అనుభవించడం.

తెలివైనవారు రెండో దానిని చేస్తారు.



నేటి మంచి మాట

www.ramkarri.com

www.ramkarri.com



గమ్యం అనేది ఒక అవకాశం కాదు,
అది ఎన్నుకోవలసిన ఒక లక్ష్యం.
అది ఎదురు చూడాల్సిన వస్తువు కాదు,
కృషి తో సాధించాల్సినది.

శుభోదయం మిత్రమా !



నేటి మంచి మాట

చిన్న విత్తనం మొలకెత్తి పెద్ద చెట్టుగా మారేలోగా ఎన్ని అడ్డంకులు.
మొదట విత్తనం మట్టిలో ఉండగానే చీమలూ, పురుగులూ
తినేసేయాలని చూస్తాయి., అది వాటిని తప్పించుకుని మొలకెత్తుతూ
ఉంటే పక్షులు దాన్ని పసిగట్టి పొడుస్తూ తినేయాలని చూస్తాయి.





## నేటి మంచి మాట

ఆ తరువాత అది పెరుగుతూ ఉంటే పశువులూ దాని పని పట్టబోతాయి
ఐనా అది ఎదిగి పెద్ద వృక్షంగా మారిందంటే,
ఇంతకాలం దాని ఎదుగుదలకు అడ్డంకిగా ఉన్న
ఆ జీవులన్నీ దాని నీడలోనే తలదాల్చుకుంటాయి.
మనిషి ఎదుగుదలా సరిగ్గా ఇలాంటిదే.

శుభోదయం మిత్రమా !!



నేటి మంచి మాట

సాధించాలన్న పట్టుదల ఉంటే
అల్లంత దూరాన ఉన్న అమెరికా
కూడా చేరువే ..
లేదంటే అందుబాటులో ఉన్న
అనకాపల్లి కూడా దూరమే ...



అనుమానం ఎప్పుడైతే ప్రవేశిస్తుందో ..
అదే ద్వారం నుండే,
ప్రేమ, నమ్మకం బైటికి వెళ్ళిపోతాయి.
బంధాలు బీటలు వారతాయి.



నేటి మంచి మాట





www.ramkarri.com

అవకాశం కూడా కాలం, కెరటం వంటిదే.

ఎవరి కోసం ఆగదు.

ఎవరు తనని ఉపయోగించుకుంటారని చూడదు.

అందుకోగలగటం మన సంసిద్ధత మీద ఆధారపడి ఉంటుంది.

శుభ దినం



నేటి మంచి మాట



www.ramkarri.com





నేటి మంచి మాట

శుభోదయం

చలికాలం ఇప్పుడు చల్లటి గాలులతో
వింజామరలు వీస్తూ వెళ్లిపోతుంది.
చలికి భయపడి ఇంతకాలం మేఘాలను
కప్పుకున్న సూర్యుడు ఇప్పుడు మెల్లిగా
బయటకు తొంగి చూస్తూ
వెచ్చటి కిరణాలను వెదజల్లు తున్నాడు.



జయానికి అపజయానికి మధ్య
ఒకటే తేడ ఆలోచనావిధానం

ఆశావాదం ఒకరిని ఆకాశానికి
ఎగిరేలా చేస్తుంది నిరాశావాదం
పాతాళానికి తొక్కేస్తుంది

నేటి మంచి మాట

www.ramkarri.com



అడుగు ముందుకు వేయగలిగితే

దూరం అన్నది ఏమీ లేదు

చెమటన్నది చిందించగలిగితే

సాద్యం కానిది ఏమిలేదు..



నేటి మంచి మాట

సముద్రంలో నీళ్ళెన్నివున్నా
లోనికివస్తే తప్ప
ఓడను ముంచలేవు.
అన్ని రకాలైన వత్తిడులు
మనల్ని బాధించలేవు.
వాటిని లోనికి రానిస్తే తప్ప



నేటి మంచి మాట





నేటి మంచి మాట

దారే కదా మూసుకుపోయింది...

నీ గమ్యం కాదుగా...!

www.ramkarri.com



మంచికి ఉన్న స్వేచ్ఛ చెడుకు లేదు, చెడుకు వున్న ఆకర్షణ మంచికి లేదు
సాధారణ ఆలోచన నుంచే అసాధారణాలు సృష్టించడం మేధావి లక్షణం.
పూలలో సువాసన , మనిషిలో యోగ్యత దాచినా దాగవు.,



నేటి మంచి మాట



మంచి విత్తనం మహా వృక్షం గా ఎదిగినట్లు మనం చేసే చిన్న మంచి పనైనా
ఒక్కోసారి ఎందరికో ఉపయోగపడుతుంది......



# నేటి మంచి మాట



జీవితం ఒక పుస్తకాల రాక్ వంటిది.
మీరు ఎంపిక చేసుకున్నవే ఇక్కడ
లభిస్తాయి. మీరు ఎంతో ఇష్టపడి,
అనుక్షణం వాటినే శ్వాసిస్తూ ఉన్నవే
మీకు లభిస్తాయి. మీకు నచ్చనివి
మీరు తీసుకోరు. కనక జీవితం మన
చేతుల్లోనే ఉంటుంది - ఉంది.
అలాకాక ''మీ జీవితం మీరు
కోరుకున్నట్లు లేదూ అంటే,
మీరు ప్రస్తుతం మీకిష్టం
లేని వాటితో అనవసరపు
కాలయాపన చేస్తున్నట్లు లెక్క''.
అవి మీ దృష్టిని మళ్లిస్తున్నట్లు
గమనించాలి.

మంచికి ఉన్న స్వేచ్ఛ
చెడుకు లేదు.

చెడుకు ఉన్న ఆకర్షణ
మంచికి లేదు.

నేటి మంచి మాట

www.ramkarri.com





# నేటి మంచి మాట



హంస తామర తూళ్ళనే తింటుంది. అందుకనే
పద్మాలతో నిండి ఉన్న సరోవరాలకై పరితపిస్తుంది.



చక్రవాక పక్షి జంటలు ప్రొద్దులతో జంటగా ఉంటాయి.
రాత్రిళ్ళు విరహావేదనను అనుభవిస్తాయి
అందుకని చక్రవాకాలు సూర్యోదయానికై నిరీక్షిస్తాయి

చాతక పక్షులు వాన చినుకులను మాత్రమే త్రాగుతుంది.
అందుకే ఘనమేఘాలకై ఎదురుచూస్తుంది.





చకోర పక్షులు చంద్రోదయానికై పరితపిస్తాయి.
చంద్రుని కాంతి కోసం వేచివుంటాయి.



# నేటి మంచి మాట





ఒక వ్యక్తి మరణించి పైలోకానికి చేరుకున్నాడు. యమధర్మరాజు, చిత్రగుప్తుడిని పిలిచి అతని ఎకౌంటు చెప్పమన్నాడు. "రాజా అతడు 190 పుణ్యాలు 190 పాపాలు చేసాడు." అని చెప్పాడు. సరేనని ఇద్దరు భటులను ఇచ్చి రెండూ చూపించమన్నారు.

ముందు నరకంలోకి వెళ్లారు. అక్కడ మంచి రుచికరమైన వంటలు, బిర్యానీ వాసనలు వస్తున్నాయి. పెద్ద డైనింగ్ టేబుల్ చుట్టూ 50 మంది భోజనానికి కూర్చున్నారు, అందరు పీక్కుపోయి ఎండిపోయి భయంకరమైన ఆకలితో ఉన్నారు. ఎదురుగా పంచభక్ష్య పరమాన్నాలున్నా ఎందుకు తినలేకపోతున్నారని దగ్గరకు వెళ్ళి చూస్తే, పాపం వాళ్ళ చేతులకి ఒక మీటరున్న గరిటలు కట్టి ఉన్నాయి. ఆహారం తీసుకున్నా అది నోట్లో పెట్టుకోలేరు, అందుకే వాళ్ళు చిక్కి శల్యమవుతున్నారు.

అక్కడనుండి స్వర్గానికెళ్ళారు. అక్కడ కూడా పంచభక్ష్య పరమాన్నాలు, చేతులకి ఒక మీటరున్న గరిటలు కట్టి ఉన్నాయి. కానీ అందరూ బాగా తిని పుష్టిగా ఎంతో ఆరోగ్యంగా ఉన్నారు. ఎలా తింటున్నారని దగ్గరకి వెళ్ళి చూస్తే ఏముంది! వారు ఆహారం తీసుకుని ఒకరికొకరు తినిపించుకుంటున్నారు. వారు భూలోకంలో కూడా అలానే మరొకరికి పెట్టారు కాబట్టి స్వర్గానికి వచ్చారు, ఇక్కడకి వచ్చినా అదే పని చేస్తున్నారు.

**ఇతరులతో పంచుకునే వాళ్లకి స్వర్గం దక్కుతుంది –**



**అంతా తమకే దక్కాలనుకునే వాళ్లకి నరకం మిగులుతుంది.**

‘సుదీర్ఘ రాత్రి’ విరహం తర్వాత, మేలిముసుగు ధరించిన
భూవధువు మంచుతెరలు తొలగిస్తూ... యౌవన సూర్యుడు!
తొలుత మబ్బుల్లోకి లే కుంకుమను గుమ్మరించాడు,
తన తరుణి నుదుట దాల్చడానికి. నెమ్మదిగా మీదికి వస్తూ,
హాయి గొలుపుతూ, విస్తరిస్తున్నాడు.


నేటి మంచి మాట

# చల్ల చల్లని శుభోదయం



ఎంత చిన్నదీ జీవితం. కానీ ఆనందించగలిగితే ప్రతి క్షణమూ ఆనందమే కదా.
అదేగా దేవుడు మనిషికిచ్చిన బహుమతి.
ఉదయిస్తున్నసూర్యుడు, గోధూళి , వెన్నెల, పూచే పువ్వులు, ఎగిసిపడే
కెరటాలు, మధురమైన పాటలు, చెట్టు వేసే కొత్త చిగురు,
మారే ఋతువులు, పడే వర్షపు చినుకు....అన్నిటినీ ప్రేమించవచ్చు.
ప్రకృతిని ప్రేమించటం లో ఎంత ఆనందం ఉన్నది. అది తన
అభిప్రాయాలు మన మీద రుద్దదు. ఇది కావాలని కోరదు .. అలగదు.
మనసు బావోలేదని అనదు. ఓదార్పు కోరదు. స్వార్థం లేదు.





నేటి మంచి మాట



నేటి మంచి మాట

ఇతరులు చేసిన పనివల్ల
నీ మనస్సుకు బాధ
కలుగుతుందో ఆ పనిని
నీవు ఇతరులకు
చేయవద్దు







www.ramkarri.com



దేవుడు ప్రతి మనిషికీ విత్తనాలు యిస్తాడు. అవి
మరేవో కావు, మన ఆనందం, ఆహ్లాదం, సంతోషం
వాటిల్లో వుంటాయి. ఆ విత్తనాలు సక్రమంగా
మొలకెత్తేలా పంటలు పండి మనల్ని
పరవశింపజేసేలా చేసుకోవడమన్నది
మన చేతుల్లో వుంది.
వాటిని మనం నిర్లక్ష్యం చేస్తే
అవి మొలకెత్తవు.
మనకు దుఃఖాన్ని మిగులుస్తాయి.
కాబట్టి నువ్వు సంతోషంగా ఉండి
ప్రక్కవాళ్ళని కూడా సంతోషపెట్టు.



నేటి మంచి మాట

మాటకు ఎన్ని భాషలో! కొన్ని వినపడతాయి. కొన్ని కనపడతాయి.
కొన్ని ఈ రెండూ కాదు . వినబడవ్వూ కనబడవ్వూ...
తల్లి ప్రేమ, నాన్న మమకారం, సోదరుడి సంరక్షణ,
సోదరి ఆప్యాయత ...ఇవి వినపడక్కర్లేదు, కనపడక్కర్లేదు.
చెప్పకుండా, చూపకుండానే అనుభవించే నిజాలివి.
ఏమైనా చిన్నమనస్ఫర్థలు ఉన్నా ఉడికే అన్నంలో ఆవిరిలాగా
ఎగిరిపోతాయి, ఆప్యాయతల తీపి ముద్దలు మిగిలిపోతాయి.





నేటి మంచి మాట



శుభోదయం..! ప్రతి ఉదయం



నేటి మంచి మాట

శుభోదయం. ఎన్నెన్నో కొత్త ఆశలతో..

ఎన్నెన్నో ఊహలతో.. నూతనోత్తేజంతో..

ఉరకలెత్తే ఉత్సాహంతో

ప్రతి సూర్యోదయం

శుభోదయం.

నులివెచ్చని కాంతులతో.. కటిక చీకటి పారద్రోలే..

అరుణ కాంతులతో. శుభోద



ప్రతి విషయం గురించి ప్రతి ఒక్కరికి ఒక వివరణ ఉంటుంది, అందరూ తమ మాటే నెగ్గాలని అనుకుంటారు. చేసిన పనికి సంజాయిషీ ఇచ్చుకుంటూ కారణాలు చెపుతూ, ఒప్పు అని నిరూపించుకోవటం అనవసరం. అంత ప్రాముఖ్యం లేని విషయాలన్నిటిలో పనిగట్టుకొని అవతలి వ్యక్తి మాట నెగ్గించుకోటానికి అవకాశం ఇస్తున్నామని, ఆ విధంగా మన సమయాన్ని, శక్తిని వృధా చేయకుండా, ఇలాంటి పనికిమాలిన వాదనలకి దూరంగా ఉండటం మంచిది. ఇలా సంజాయిషీ ఇచ్చుకుని, అవతలి వ్యక్తి తనని తను సమర్ధించుకునే అవకాశాన్ని ఇచ్చే ధోరణిని తగ్గించుకోవటం వల్ల మనకి విపరీతమైన స్వేచ్ఛ లభిస్తుంది...

నేటి మంచి మాట





తెలివైనవాళ్ళు కోపాన్ని
మనుషుల మీద చూపించరు.



నేటి మంచి మాట

ఆ కోపాన్ని సమస్యల పైకి మళ్ళించి
పరిష్కారాలు కనుక్కుంటారు.





నాచును చేతితో ప్రక్కకు నెట్టగానే నీరు
కనిపిస్తుంది .....అయితే నీరు కనిపించిబిది కదాని
చేయి తీసేస్తే మరల నీరు కప్పబడిపోతుంది

మనసులో ఉండే కల్మషాన్ని తొలగించడానికి మంచి
మార్గం వైపు పయనించాలనుకుంటే సరిపోదు. ....
ఆ మార్గాన్ని అన్వేషిస్తూ సజ్జనుల సాంగత్యంలో
ఉంటూ నిరంతరం సాధన చేయాలి .



నేటి మంచి మాట



లక్షరూపాయలు తగిలే లాటరీ టిక్కెట్ కూడా

కష్టపడి సంపాదించిన రూపాయితోనే కొనాలి.

జీవితం హైవే .

గెలుపు వన్ వే . .

అందులో షార్ట్‌కట్స్ కి నో వే . . .



నేటి మంచి మాట

పూలు గుచ్చిన దారానికి సువాసనలు అబ్బినట్లు, సజ్జన సాంగత్యంతో మనకు అన్నివిధాలా మేలు చేకూరుతుంది. అదే దుర్జనులతో సహవాసం చేస్తే మన అస్తిత్వం దెబ్బతినడమే కాకుండా, వారి గుణాలు మనల్ని ఆవహించే అవకాశం ఉంది. సజ్జన సాంగత్యం వలన సర్వత్రా ప్రయోజనం చేకూరుతుంది.

www.ramkarri.com



నేటి మంచి మాట



హాయిగా ఉండటం, ఇతరులను హాయిగా
ఉంచగలగటం ఒక కళ.
ఈ లక్షణం ఉన్నవాళ్లకి చింతలు ఉండవు.
'చితి' కళేబరాన్ని దహిస్తే,
'చింత' మనస్సును దహిస్తుంది.
మనస్సు ఒక పాత్ర. దానిలో పూలు పెడితే పూలకుండీ అవుతుంది.
చెత్త వేస్తే చెత్త కుండీ అవుతుంది. నిర్ణయం ఎవరికి వారే తీసుకోవాలి.
ఎవరి భవిష్యత్తుకు వారే రూపశిల్పులు. గతం అయిపోయింది.
భవిష్యత్తు తెలియదు. వర్తమానంలో జీవించటం నేర్చుకోవాలి.
ప్రతిచిన్నవిషయాన్నీ ఇష్టంగా గ్రహించాలి.
'వర్షపు చినుకులు ఎంత అందంగా ఉన్నాయి!' అనుకుంటే
హాయిగా ఉంటుంది. 'పొద్దుటి నుంచీ ఈ ముసురుతో విసుగ్గా ఉంది'
అనుకుంటే చిరాకు కదా!
"జటిలమైన జీవనయానాన్ని ఆహ్లాదకరంగా మలుచుకోవచ్చు"
అని చెప్పిన మహనీయుడు జిడ్డు కృష్ణమూర్తి.






భయం..

రూపం లేనిది..

కాని ఒక్కసారి మనలోకి ప్రవేశిస్తే..

ఆకారం..సూక్ష్మరూపం నుండి ..కొండంతై..

మన ధైర్యాన్ని హరిస్తుంది..

ఆ భయాన్ని అణచగెలిగే శక్తి..

మన పట్టుదలే

www.ramkarri.com



నేటి మంచి మాట



చీకటి లేకుంటే.. మెరిసే నక్షత్రాలకు విలువేది...
గ్రహణమనేదే లేకుంటే సూర్యచంద్రులకు వెలువేది..
కష్టం అనేదే లేకుంటే సుఖం విలువ తెలిసేనా..
మనిషి మంచి దారిన నడిచేనా...??

మిత్రులందరికి శుభ రాత్రి..

నేటి మంచి మాట

సముద్రంలోని ఉప్పునీరు,
మురుగునీటి కాలువలు,
పాచిపట్టిన చెరువులూ...
వీటిలో వేటినించైనా నీరు ఆవిరై
మళ్లి కిందకి వానగా కులిస్తే
అది స్వచ్ఛమైన
మంచి నీరుగా మారుతుంది.
అదే విధంగా మనిషి దైవంతో
సంబంధం పెట్టుకున్నప్పుడే
అతని ఆలోచనలు, భావాలు
మంచిగా మారతాయి. తనని తాను
ప్రక్షాళనం చేసుకుంటాడు.
ప్రార్థనలు పైకి వెళితే,
ఆశీస్సులు కిందకి దిగి వస్తాయి.



ఒక పండితుడు తెల్లవారు ఝామునే లేచి నదిలో స్నానానికి దిగాడు. ఆ సమయంలో ఒక బౌద్ధ భిక్షుణి మంచినీటి కుండతో ఆ నదీతీరానికి వచ్చింది. చలికి ఆ పండితుడు పడుతున్న పాట్లు చూసి ... " ఓ పండితా! నేను మంచినీటికోసం ఈ చలిలో రాకా తప్పదు నీటిలో దిగకా తప్పదు... కానీ తమరు ఎందుకు కోసం వచ్చారు? ఈ చలిలో ఇబ్బంది పడుతున్నారు?" అని అడిగింది. అందుకు ఆ పండితుడు నవ్వి, "తెల్లవారు ఝామున నదిలో స్నానం చేస్తే, పాపాలు నశిస్తాయని తెలియదా! ముక్తి లభిస్తుందనీ, పుణ్యం వస్తుందనీ నీకెవరూ బోధించలేదా? అంటూనే మరోమారు నదిలో మునిగి లేచాడు.




అందుకామె "ఓ పండితా! పాపకర్మలు చేసి నదుల్లో మునగడం కంటే, అసలు పాపమే చేయకుండా ఉండటం మేలు కదా! బురదలో దిగడం, కాళ్లు కడుక్కోవడం కంటే బురదలో అడుగుపెట్టకపోవడమే నేర్పరి చేసే పని, ఇదే నిజమైన కర్మ కదా" అంది.
సత్యాన్ని గ్రహించిన పండితుడు ఆమెకు గౌరవంగా నమస్కరించాడు.



గెలుపంటే ఇతరుల కన్నా నువ్వు గొప్పవాడివి
అవ్వడం కాదు. నిన్నటి "నువ్వు" కన్నా ఈ రోజు
"నువ్వు" బాగుండడం. జీవితమెప్పుడూ... అప్పుడే
పుట్టినంత కొత్తగా అనిపించటం. ప్రతిక్షణం
ఆనందంగా ఉండగలగడమే గెలుపంటే.



నేటి మంచి మాట

www.ramkarri.com



అదొక గ్రామం. అక్కడ దేవాలయ నిర్మాణానికి జోరుగా పనులు సాగుతున్నాయి. అనేకమంది కూలీలు ఆ నిర్మాణంలో పనిచేస్తున్నారు, అందరు శ్రద్ధగా పని చేస్తున్నారు. అ సమయంలో ఒక అతను కుతూహలం కొద్దీ అక్కడ జరిగేదేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. రాళ్లు ముక్కలు చేస్తున్న ఒకరి దగ్గరకువచ్చి, 'ఇక్కడ ఏం చేస్తున్నారు?' అని అడిగాడు. 'కనిపించడం లేదా! రాళ్లు ముక్కలు చేస్తున్నాను' అని చూడకుండానే ఆగ్రహంతో, నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు. అతను అక్కడితో ఆగలేదు. అదే ప్రశ్న మరోవ్యక్తిని అడిగాడు. వాడు అతని వైపు చూస్తూ, 'నా ఆహారాన్ని సంపాదించుకుంటున్నాను' అన్నాడు. అతనికి రెండో వ్యక్తి కొంత మెరుగ్గా కనిపించాడు. అయినా తగిన సమాచారం రాలేదనిపించింది. మూడో వ్యక్తిని సమీపించి పరీక్షగా చూశాడు. వాడు తనపనేదో తాను చేసుకుపోతున్నాడు. చుట్టుపక్కల ఏం జరుగుతున్నా తనకు అనవసరమన్నట్టుగా, తనకు అప్పగించిన పనిని ఏకాగ్రతతో కొనసాగిస్తున్నాడు. ఆ ఇద్దర్నీ అడిగినట్లుగానే మూడోవాడినీ అడిగాడు. తన ఏకాగ్రతను చెడగొట్టినట్లుగా భావిస్తూ, అతని వైపు చూసి,'ఇక్కడ గుడి కడుతున్నారు. రాళ్లను తగురీతిగా మలచడం నాపని. అదే చేస్తున్నాను' అని నింపాదిగా జవాబిచ్చాడు. ఆగంతకుడికి కావలసిన సమాధానం దొరకడంతో అక్కడి నుంచి వెళ్లిపోయాడు.



చూశారా! ముగ్గురూ చేసేది ఒకే పని. కానీ ఒక్కొక్కరూ చూస్తున్న విధానం వేరువేరుగా ఉంది. మొదటివాడికి పని పట్ల నిర్లక్ష్యం. రెండో వాడికి తనవంతు పనిచేయడమే లక్ష్యం. మూడోవాడికి పని మీద ధ్యాస కంటే, పనిని పనిగా కంటే, ఒక పవిత్ర కార్యంగా భావించే తత్త్వం. తన కర్తవ్యాన్ని ఉత్సాహంగా, కల్మషరహితంగా నిర్వహిస్తున్నాడు. ప్రతిమనిషి తనపని తాను చేసుకుపోతుంటాడు. అయితే ఆ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలోనే తేడా ఉంటుంది. కొందరు నిర్లక్ష్యంగా, మరికొందరు నిర్లిప్తంగా, ఇంకొందరు ఉత్సాహంతో పనిని పవిత్రంగా, దైవంగా భావిస్తూ చేస్తుంటారు. పనిపట్ల వారివారి శ్రద్ధాసక్తులు వారి ప్రవర్తనలోనే కనిపిస్తుంటాయి.



నేటి మంచి మాట

ఒక చిన్న కుటుంబం లో ఉన్నా నలుగురూ ఏదో విషయం మీద ఒకరి మీద ఒకరు చిరాకు పడుతూ వుండేవారు. కాశి నుంచి వచ్చిన అవ్వ వీళ్ళ ప్రవర్తనను చూసి నవ్వుకుంది. నాలుగు తువ్వాళ్ళు తీసుకోని, మీకో విషయం చెప్పాలి అని నలుగురిని పిలిచింది. తువ్వళ్ళతో నలుగురిని ముఖం కప్పుకోమ్మని చెప్పింది. ఇపుడు మీరు కాశి లో ఉన్నారు, మీకు అవసరం లేని వస్తువు ఒకదాన్ని తీసేయండి చూద్దాం" అంది. వాచ్, సెల్ ఫోన్, చెప్పులు, పర్స్ ఇలా అందరు తలొకటి తీసేసారు. అలా ఒకదాని తర్వాత ఒకటి అవ్వ అడగడం, వాళ్ళు వస్తువులు తీసేయడం జరిగింది. చివరకు అవ్వ అంది " ఏమేమిటో తీస్తున్నారు ముందు మీ ముఖం మీద కప్పుకున్న తువ్వాలు తీయండి" అని నవ్వింది. అయ్యో అని వాళ్ళ మూర్ఖత్వం మీద వాళ్ళకే నవ్వు వచ్చింది. కాశి పోనక్కర్లేదు, గడియారాలు, చెప్పులు పర్సులు సెల్ ఫోన్లు వదలక్కర్లేదు. ఆ టవల్ లాగే చికాకులు కోపాలు మీ కళ్ళకు పొరల్లా అడ్డు వస్తున్నాయి. అది తీసేస్తే ఒకరినొకరు సంతోషంగా చూసుకోవచ్చు. మనుషుల మధ్య అభిమానాలు పోగొట్టుకొని టవల్ కప్పుకోవద్దు, టవల్ తో పొరలు తుడుచుకోండి. :)





జీవితంలో భిన్న అనుభవాల కోసమే
మనకు భిన్నమనస్తత్వాలు కలిగిన
బంధుమిత్రులను ఇచ్చింది.
వారందరితో భిన్న అనుభవాలు
మన జీవితానికి సరైన మార్గం చూపుతాయి,
జీవితాన్ని ముందుకు తీసుకువెళతాయి.





నేటి మంచి మాట



ఓ భగవంతుడా !....
నేను మానసికంగా బలహీనంగా ఉన్నప్పుడు ఎందుకు ఆ విధంగా
ఉన్నానో తెలుసుకోగలిగే విశ్లేషణ నాకివ్వు.
నేను భయపడ్డప్పుడు ఆ భయానికి గల కారణం
తెలుసుకోగలిగే ధైర్యాన్నివ్వు.
గెలిచినప్పుడు ఆ గెలుపుని గర్వంగా మారనివ్వని వినమ్రతనివ్వు..
ఒక ఓటమిలో కూరుకుపోయినప్పుడు ఆ ఓటమిని
ఒప్పుకోగలిగే సాహసమివ్వు.
హాయిగా నవ్వ గలగటం, అనుభూతులని ఆస్వాదించటం
నానుంచి దూరం చేయకు..
ఆశలని మెదడులో నింపకు..
ఆశలని హృదయంలో ఉంచి,
అవి నెరవేరే ఆలోచనలని మెదడులో నింపు.





నేటి మంచి మాట

వంటింటి వాస్తు మార్చేస్తే
వంటికి పట్టిన దరిద్రం పోదు




ఒళ్ళొంచి కష్టపడితే
వద్దన్నా అదృష్టం రాక మానదు

www.ramkarri.com

కృతజ్ఞత మాటల్లో, చేతల్లో కూడా వ్యక్తం
కావాలి. ప్రేమించడం, ఇవ్వడం అనేవి
మనం వారసత్వంగా పొందే లక్షణాలు.
ప్రేమించకుండా ఇవ్వవచ్చునేమో కాని,
ఇవ్వకుండా ప్రేమించలేమంటారు -
తీసుకోవడంలోకన్నా,
ఇవ్వడంలోనే ఆనందమున్నది.



నేటి మంచి మాట

శుభోదయం





# కృషితో..

**కృషితో నాస్తి దుర్భిక్షం**
**జపతో నాస్తి పాతకమ్**
**మౌనేన కలహం నాస్తి**
**నాస్తి జాగరతో భయమ్**

కష్టపడి పనిచేసేవాడికి కరువన్నదే ఉండదు.
ఎప్పుడూ దేవుణ్ణి తలచేవాడికి పాపం అంటదు.
మౌనాన్ని ఆశ్రయిస్తే పోట్లాటలకు తావు ఉండదు. ఎల్లవేళలా
జాగురూకతతో ఉండేవాడికి భయం ఉండదు

ఏ వ్రాత వ్రాసినా కాగితం దాన్ని తనలో
దాచుకుంటుంది.



కానీ కొన్ని వ్రాతలు మాత్రమే కా
దాచుకునేలా చేస్తాయి.

పరిచయాలు అంతే... కొన్ని తామరాకుమీద
నీటిబొట్టులా జారిపోతుంటాయి.
కొన్నే మనసు పొరల మధ్య
మొగలిరేకుల్లా నిలిచిపోతాయి...
అవే పరిమళించే పరిచయాలు......

ww.ramkarri.com





అలసిన వేళలో మొక్కలు, పువ్వులే
నిజమైన విశ్రాంతినిస్తాయి.
వీటిని కాపాడితే మనకే కాదు చుట్టూ
ఉన్నవారికీ మేలు చేసినట్టే.

శుభోదయం



www.ramkarri.com

ఉదయాన్నే లేచి పొయ్యి ముందు కూర్చుని
చలి కాచుకున్న ఆ రోజులు ఎంత మధురం.



www.ramkarri.com

నేటి మంచి మాట



మిత్రులందరికి శుభోదయం





నేటి మంచి మాట

బాల్యం హేమంతం,
కాస్త వయసు రాగానే పెళ్ళనే వసంతం కోసం
ఎదురు చూసే శిశిరం –
పెళ్ళయ్యాక గ్రీష్మం –
సంసార భాధ్యతలు వర్ష రుతువు –
మరణం శరత్ వెన్నెల



నేటి మంచి మాట

శుభోదయం

ఓటమి అంటే వాయిదా పడ్డ గెలుపు. ఇంకా చెప్పాలంటే
ఓటమి కూడా ఓ గెలుపే. ఆ ఓటమి నీ ప్రయత్నంలో ఏదో
లోటు ఉందని గుర్తు చేస్తుంది. మరి కాస్త కృషి
అవసరమని హెచ్చరిస్తుంది. అంటే, అక్కడ ఓటమి
మనకు ఓ గురువులా హితబోధ చేసినట్టేగా!



నేటి మంచి మాట

ఎన్ని సత్కార్యాలు చేసినా,
ఎన్ని ఆరాధనలు ఆచరించినా,
ఎంత ప్రసన్నమైన ధార్మిక వస్త్రధారణ చేసినా,
ఎంత భక్తిని ఒలకబోసినా,
'ప్రవర్తన' సరిగా లేకపోతే,
వాక్కు మంచిగా లేకపోతే, సాటివారిపట్ల,
సమాజం పట్ల బాధ్యతను విస్మరిస్తే
అంతా నిరర్థకం, నిష్ప్రయోజనం.

మంచి భావనం



మంచి ఆలోచన

మంచి జీవనం

మంచి భాషణం



# మంచి నడవడికకు అష్టాంగ మార్గాలు





## నేటి మంచి మాట

మంచి ప్రయత్నం

మంచి నిర్ణయం



మంచి శీలము

ఆత్మపరిశీలన

www.ramkarri.com



"ఆకలి బరించలేక పోతున్న ప్రాణాన్ని పిడికెడు ముద్దతో బ్రతికించగలం"...రైతు



నేటి మంచి మాట

రైతు ఏడ్చిన రాజ్యం,

ఎద్దు ఏడ్చిన వ్యవసాయం,



మహిళ ఏడ్చిన కుటుంబం బాగుపడవట

అది ఎంత వరకు నిజమో తెలియదు కాని

నిజానికి మడి బీదకాదు మన రైతే బీద

ప్రకృతిలో ప్రతి ఒక్కదానికీ తనకంటూ ఒక ప్రత్యేకత ఉంటుంది .ఒక కోడి ఆ సంగతి తెలుసుకోకుండా నెమలి తనకంటే అందంగా ఉందని, నెమలి ఈకలు ఉన్నంత అందంగా తన ఈకలు లేవని ఉడుక్కుంది .ఆకోపంతో తన ఈకలను పీకేసుకుంది .అప్పుడు ఏమవుతుంది? ఈకలు పీకిన కోడవుతుంది కాని నెమలి అయిపోతుందా? మనలో ఉండే మంచి లక్షణాలకు మెరుగులు పెట్టి ప్రత్యేకత సంపాదించుకోవాలి. కాని, ఉడుక్కుని మనలో ఉన్న సమర్ధతను కూడా పోగొట్టుకోవడం మంచిది కాదు

నేటి మంచి మాట








www.ramkarri.com

ఈ నాగరిక సమాజం చేసే పనులన్నిటిలోకీ అనాగరికమైన పని పోచికోలు కబుర్లు చెప్పుకోవటం. పెద్ద చదువులు చదివినవాళ్ళు, మర్యాదస్తులమని చెప్పుకునేవాళ్ళు కూడా ఇటువంటి అనాగరికమైన పనికి పూనుకుంటారు. ఒక చోట చేరి వీళ్ళు చేసే అతి ముఖ్యమైన పని అక్కడ లేనివాళ్ళ గురించి ఇష్టం వచ్చినట్టు వాగటం. పనికిమాలిన వాగుడుతో ఇతరుల జీవితాలకి వాటిల్లే నష్టాన్ని గురించి కొంచెం కూడా పట్టించుకోరు. మిడిమిడి జ్ఞానంతో ఇతరులని అంచనా వేసామని వ్యర్ధ ప్రసంగం చేయటం. ఇలా వ్యర్ధ ప్రసంగాలు చేసేవాళ్లందరూ చివరికి తాము సృష్టించిన విషాన్ని తామే తాగుతారు, ఇతరులు తమని గురించి ఏమనుకుంటున్నారో అని భాద పడుతూ ఉంటారు. వ్యర్ధ ప్రసంగం చేసేవాళ్లు ఇతరుల వినోదం కోసం, వాళ్లని తృప్తి పరిచేందుకే జీవిస్తారు.

www.ramkarri.com

నేటి మంచి మాట



# పొరుగింటి పుల్లకూర రుచిగా ఉంటుంది మనకి

www.ramkarri.com




| యాపిల్ | | | జామ | |
|---|---|---|---|---|
| Amount per | 100 grams | | 100 grams | |
| Calories | 52 | | 68 | |
| | | % Daily Value | | % Daily Value |
| Total Fat | 0.2 g | 0% | 1 g ✓ | 1% |
| Saturated fat | 0 g | 0% | 0.3 g ✓ | 1% |
| Polyunsaturated fat | 0.1 g | | 0.4 g ✓ | |
| Monounsaturated fat | 0 g | | 0.1 g ✓ | |
| Sodium | 1 mg | 0% | 2 mg ✓ | 0% |
| Potassium | 107 mg | 3% | 417 mg ✓ | 11% |
| Total Carbohydrate | 14 g = | 4% | 14 g = | 4% |
| Dietary fiber | 2.4 g | 9% | 5 g ✓ | 20% |
| Sugar | 10 g ✓ | | 9 g | |
| Protein | 0.3 g | 0% | 2.6 g ✓ | 5% |
| Vitamin A | 54 IU | 1% | 624 IU ✓ | 12% |
| Vitamin C | 4.6 mg | 7% | 228.3 mg ✓ | 380% |
| Calcium | 6 mg | 0% | 18 mg ✓ | 1% |
| Iron | 0.1 mg | 0% | 0.3 mg ✓ | 1% |
| Vitamin B-6 | 0 mg | 0% | 0.1 mg ✓ | 5% |
| Magnesium | 5 mg | 1% | 22 mg ✓ | 5% |

మీరు బాజారుకి వెళ్ళి యాపిల్ కొనాలనుకుంటే ఏ రోడ్డు మీదైనా అమ్మే బండి కనబడుతుంది, అదే జామకాయ కొనాలంటే మాత్రం వెతికి, వెతికి పట్టుకోవాల్సిన పరిస్థితి. దీనికి కారణం మనమే. యాపిల్ ఆరోగ్యానికి మంచిదని జరిగిన ప్రచారంతో------ జామకాయ వెనుకబడింది.

జామకాయలుః 1 Kg . ₹ 25 – 35

యాపిల్స్ః 1Kg = ₹ 125 – 150

మరి పోషకాలు దేనిలో ఎక్కువ ఉన్నాయో మీరే చూసి ఏది ఎక్కువ బలాన్ని ఇస్తుందో చెప్పండి.

యాపిల్స్ ఉత్తర భారతాన పండి, ఇక్కడకు రావాటానికి అయ్యే రవాణా ఖర్చువల్ల ఇంత ధర పలుకుతున్నాయి.

యాపిల్స్ తినొద్దు అనటంలేదు



జామకాయలు విరివిగా కొని మనరైతులను ప్రోత్సహించండి

## నేటి మంచి మాట

బాల్యం భలే బాగుంటుంది
ఏది మన చేతిలో ఉండదు
ఒక్క ఆటపాటలు తప్ప
నాకు మళ్లీ వస్తే బాగుండు



www.ramkarri.com

www.ramkarri.com



**నేటి మంచి మాట**

నీ గతాన్ని
చెత్త బుట్టలో పడేయి.
నీ వర్తమానాన్ని
నీ బల్ల మీదుంచుకో.
నీ భవిష్యత్తును
ఎదురుగా గోడపై ఉంచుకో.
ఇష్టంగా శ్రమిస్తే
విజయం నీదేనని తెలుసుకో.





## నేటి మంచి మాట

'విత్తునుబట్టే చెట్టు'' అంటారు. నిజమే మరి.
మనం నేలమీద చల్లిన విత్తనాలే
మహావృక్షాలవుతాయి. తోటకూర విత్తనాలను
చల్లి మనం మర్రిచెట్టును ఎదురుచూడలేం
కదా..! తోటకూరే వస్తుంది. మనం ఏ విత్తనాన్ని
నాటితే ఆ వృక్షమే వచ్చినట్లు,
ఈ ప్రపంచంలో, మనం ఏమిస్తే...
అదే తిరిగి వస్తుంది.
మీరు చేసిన పనితీరునుబట్టే ఆ ఫలితం
యొక్క స్వభావం ఆధారపడి వుంటుంది.
మంచి ఆలోచనలను చేయండి.
మంచి ఫలితాలను పొందండి.





భర్త రోజు వచ్చే టైం కన్నా రెండు గంటలు ఆలస్యంగా వచ్చాడు. పిల్లలిద్దరు ఎదురు వెళ్ళిన పట్టించుకోలేదు, మంచి మార్కులొచ్చాయి అని చెప్పినా వినిపించుకోలేదు. విసుగ్గా బెడ్ రూమ్ లోకి వెళ్ళిపోయాడు.

పలకరించిన భార్య ని కసురుకున్నాడు. ఆమె మూడ్ ఆఫ్ అయ్యింది. ఏదో అల్లరి చేసిన పిల్లలని ఒక్కటేసింది.

భర్త తన మనస్తాపాన్ని భార్యకూ, పిల్లలకూ క్యారీ చేశాడు. ఇల్లంతా స్విచ్ ఆఫ్ అయిపోయింది.

పిల్లలకైతే యూనిట్ టెస్టులనీ, క్వార్టర్లీ అనీ, హాఫ్ ఇయర్లీ అని టీచర్స్ మార్కులేస్తారు....

మరి పెద్దయ్యాక?

మనకు మనమే మార్కులు వేసుకోవాలి. మన వల్ల ఒకరు భాదపడిన రోజు మనకు సున్నా మార్కులు వచ్చినట్లు ...

మన వల్ల ఒకరు నవ్విన రోజు మనం డిస్టింక్షన్ లో పాస్ అయినట్లు....






గాలిపటం ఎగరడానికి గాలి కావాలి. కాని అది ఇంకా ఎత్తుకు, ఇంకా పైపైకి ఎగరాలంటే మాత్రం, అది ఆ గాలికి ఎదురీదినప్పుడే సాధ్యమవుతుంది. ఎదురు తిరగకపోతే గనక, గాలి ఎటు వీస్తే అటు కొట్టుకుపోతుంది. పైకి ఎగరడం అటువుంచి దాని ఉనికినే కోల్పోతుంది.

నేటి మంచి మాట

మన జీవితంలో ఎదురయ్యే ఆటుపోట్లే ఈ గాలి. ఆ గాలికి ఎదురు నిలబడినప్పుడే మనం పైకి ఎదుగుతాం. అయితే కష్టం వచ్చినప్పుడు కుటుంబం మొత్తం వారికి ఆధారంగా నిలబడాలి.



కుటుంబంలో ఒకరికి ఇబ్బంది తలెత్తినప్పుడు కుటుంబ సభ్యులందరూ వారికి ప్రేమదారంగా ఉండాలి. అప్పుడు కష్టం గాలిలా తేలిపోతుంది. అనుబంధం ఆకాశమంత విస్తరిస్తుంది.





నేటి మంచి మాట

శ్రోత కాని వాడు వక్త కాలేడు.
ఎవరు చెప్పినా వినాలి,
ఎంత చెత్తగా చెప్పినా వినాలి.
దానివల్ల ఎలా మాట్లాడాలో,
ఎలా మాట్లాడకూడదో
కూడా తెలుస్తుంది.

"We learn How to talk from some persons – and how not to talk from some"





www.ramkarri.com



# చాణక్య నీతి చంద్రిక



పూల సౌరభం గాలి వీస్తున్న వైపే వ్యాపిస్తుంది.
మంచితనపు పరిమళాలు అన్ని దిక్కులకూ విస్తరిస్తాయి.

ఓటమికి ఇంకోక పేరు అసూయ.



నిరంతరం పనిలో నిమగ్నమైయున్న వారు నిత్యం సంతోషంగా ఉంటారు.

రాజు సగటు మనిషిగా జీవించే చోట ప్రజలు రాజభోగాలు అనుభవిస్తారు.
పాలకులు రాచరిక సౌఖ్యాలను అనుభవించే చోట ప్రజలు యాచకులై జీవిస్తారు.

అధముడి దగ్గరైనా సరే, ఏదైనా మంచిని నేర్చుకోవలసి వస్తే వెనుకాడవద్దు.

భయం దరి చేరగానే దాన్ని ఎదుర్కొని నాశనం చెయ్యి.



నేటి మంచి మాట

నీ రహస్యాలను ఎవరితోనూ పంచుకోకు. అది నిన్ను నాశనం చేస్తుంది.

అదుపులోలేని మనసు కళ్ళెంలేని గుర్రంలా చాలా ఇబ్బంది పెడుతుంది. గాలిలో వుంచిన కాగితంముక్కలా ఎటుపడితే అటు పరుగులు తీస్తుంది. పురాణపురుషులుకూడా మనసును అదుపులో వుంచలేక తలకిందులైనవారే.



పుస్తకం గాలిలో వుంచితే కాగితం ముక్కలా ఎగరదుకానీ, ఎగరటానికి ఉబలాటపడుతుంది. టపటపమని ధ్వని చేస్తుంది, నానా అవస్థలు పడుతుంది. అందుకే చిన్న కాగితాన్నయినా, పెద్దపుస్తకాన్నయినా ఒకరాయి ఎగరకుండా, పేజీలు కదలకుండా కట్టడిచేస్తుంది. రాయి అనే కళ్ళెం మనసుకు ఎంతో అవసరం.





నేటి మంచి మాట



సంబంధాలు విత్తనాల్లాంటివి. వాటిని పోషించి పెంచాల్సి ఉంటుంది.
ఆకాంక్షలు కలుపు మొక్కల్లాంటివి. అవి వాటంతట అవే పెరుగుతాయి.
కానీ ఒక సంబంధాన్ని పట్టించుకోకుండా వదిలేస్తే,
దాని నించి మనం ఆశించేది లభ్యం అవదు.
కొన్ని బాంధవ్యాలు శాశ్వతమేనని అనుకోని, పెంచి పోషించేందుకు
ఏమి చెయ్యరు. ఆశించటం మాత్రం ఎక్కువవుతూనే ఉంటుంది.
సేవింగ్స్ బ్యాంక్ అకౌంట్ నే ఉదాహరణగా తీసుకోవచ్చు.
ఎంత జమ చేస్తామో అంతే తీసుకోగలుగుతాం.
ఎదుటి వ్యక్తి మిమ్మల్ని అర్థం చేసుకోవాలంటే వీలైనంత
తరుచుగా మాట్లాడండి, వినటానికి అర్థం చేసుకోటానికి
సమయం వెచ్చించండి.
ప్రదర్శన సాయంతో మీ ప్రేమని అవతలి వ్యక్తిని చూడనివ్వండి
- ఇవ్వటం ధోరణి కలిగి ఉండండి.
అలానే అందంగా తీసుకోవటం కూడా అలవరచుకోండి.
తీసుకోవటం అనేది ఒకరకంగా ఇచ్చే వ్యక్తికి చూపించే గౌరవం.

నేటి మంచి మాట

మానవ సంబంధాలు ఆహ్లాదకరంగా, ఆత్మీయంగా ఉంటే మన జీవన గమనమూ, ఆనంద దాయకంగా ఉంటుంది. మనిషి మనిషిగా సహజంగా జీవించినపుడే సంపూర్ణంగా ఆనందం కల్గుతుంది. ఆ సంతృప్తే సచ్చిదా నందం.. నదిలో నీళ్లు ఎన్ని ఉన్నా మనం తీసుకునేది మన వెంట తీసుకు వెళ్లిన పాత్ర మేరకే అన్ననానుడి అందరికీ తెలిసిందే. ఆనందం కూడా అంతే. ప్రపంచంలో అన్ని జాతులకూ, మతాలకూ సమ్మతమైంది ఆనందం. ఆనందం ఒక వస్తువు కాదు. అది ఆంతరిక అనుభూతి.



నేటి మంచి మాట



# శుభ దినం

బురదలో పుట్టి, బురదలో పెరిగినా
తామరపువ్వు స్వచ్ఛంగా ఉంటుంది.
ఇది మానసిక స్వచ్ఛతను సూచిస్తుంది.
ప్రతికూలత మధ్య కూడా తనను తాను
స్వచ్ఛంగా నిలుపుకునే గుణం మనకు ఆదర్శం.



నేటి మంచి మాట



శుభదినం



www.ramkarri.com

www.ramkarri.com

జ్ఞాపకాలు విరబూసిన పూలు లాంటివి.
పరిమళాన్ని వెదజల్లుతాయి..
ఒక్కో జ్ఞాపకానికి ..ఒక్కో రంగు...
ఒక్కో పరిమళం..కొన్నిటికి ముల్లులు.

శుభోదయం

రామ్ - 8096339900

మనసు ఒడి నిండా ఎన్ని నింపుకుంటే
అన్ని కమ్మని పరిమళాలు.

తల్లిదండ్రుల ఆంక్షలు తప్పించుకునే స్వేచ్ఛ కోసం ఆరాటపడే బంగారుతల్లులు,
బంగారు తండ్రులు మన బంధువుల ఇళ్ళల్లో, స్నేహితుల ఇళ్ళల్లో ఎందరో! లేట్
గా ఇంటికి వచ్చినందుకు అమ్మ మందలించిందని, స్నేహితులతో రాత్రి పూట
తిరుగుళ్ళు ఏంటని నాన్న విసుక్కున్నారని అలా స్వేచ్ఛను వెతుక్కుంటూ వెళ్ళిన
వారు ఎందరో! చాలా మంది వెనక్కి వచ్చేస్తారు, కొందరు ఎక్కడున్నారో
తెలియదు, వాళ్ళు కోరుకున్న స్వేచ్ఛ దొరికిందో లేదో తెలియదు,
దొరికిన స్వేచ్ఛ వాళ్ళకి నచ్చిందో లేదో తెలియదు.

వీళ్ళని చూస్తుంటే గాలిపటం గుర్తుకొస్తుంది. నీలపు ఆకాశం లో ఆహ్లాదంగా ఎగిరే
గాలిపటం గుర్తుకొస్తుంది. గాలి తాకిడికి పులకించి నాట్యమాడే గాలిపటం కూడా
మన పిల్లలాంటిదేమో! గాలిపటానికి మనసు ఉంటే! తాను ఎగిరే దారమే బంధనం
అనుకుంటే? స్వేచ్ఛకు అవరోధం అనుకుంటే? తమాషాగా
ఉందికదా! బంధమే స్వేచ్ఛకు ఆధారం. మన సంస్కృతి,
మన విలువలు మన కుటుంబ బాంధవ్యాలు...
మన దారాలు....మన స్వేచ్ఛకు ఆధారాలు.
గాలిపటానికి దారం లేకపోతే గాలి లో దీపం పెట్టినట్టే!
స్వేచ్ఛకు బంధానికి తెగని ముడి అవసరం.

రామ్ - 8096339900

ఒకసారి రైతు దేవుడితో పొట్లాట వేసుకున్నాడు. ''నీకు వ్యవసాయం గురించి ఏమి తెలుసు? నీవనుకున్నప్పుడే వర్షాలు కురిపిస్తున్నావు. నీ వల్ల చాలా ఇబ్బందిగా ఉంది. నా మాట విని ఈ పనులన్నీ ఒక రైతుకు ఇచ్చేయ్'' అన్నాడు. దేవుడు, ''ఎండ, వాన, గాలి అంతా నీ వశంలో ఉండుగాక'' అని వరమిచ్చేసి వెళ్లిపోయాడు. పంటల కాలం వచ్చింది.''ఓ వానా, కురు!'' అన్నాడు. వాన పడింది! ఆగమంటే ఆగింది! నేలను దున్నాడు. కావలసిన వేగంతో గాలిని రమ్మన్నాడు. విత్తనాలు జల్లాడు. గాలి, వాన, ఎండ అన్నీ అతను చెప్పినట్లు విన్నాయి. చేలు పచ్చగా ఎదిగాయి. కోతల కాలం వచ్చింది. రైతు ఒక వరి కంకిని కోశాడు. తీసి చూశాడు. నివ్వెరపోయాడు! లోపల ధాన్యం కనిపించలేదు. వెంటనే, మరో కంకిని కోసి చూశాడు. దానిలో కూడా ధాన్యం లేదు. ''ఓ భగవంతుడా! గాలి, వాన, ఎండ అన్నింటినీ సమంగానే వాడాను. కానీ పంట ఎందుకు దెబ్బతిన్నది?'' అంటూ కోపంగా అరిచాడు. దేవుడు ''నా దగ్గరున్నప్పుడు గాలి వేగంగా వీచేది, అప్పుడు పైరు అమ్మను గట్టిగా వాటేసుకునే పసిపిల్లల్లా భూమిలో తమ వేర్లను చాలా లోతుల్లోకి తీసుకెళ్లేవి. అలాగే వాన తగ్గిందంటే, నీటిని వెదుక్కుంటూ వేర్లను నాల్గు దిక్కులకూ పంపించేవి. పోరాట పటిమ ఉంటేనే మొక్కలు తమను తాము కాపాడుకునేందుకు బలంగా పెరుగుతాయి. అన్నింటికీ వసతులు కల్పించి, ఇవ్వగానే నీ పంటకు సోమరితనం వచ్చేసింది. ఏపుగా ఎదిగిందే గాని, ధాన్యం ఇవ్వడం దానిచేత కాలేదు'' అన్నాడు. ''వద్దు స్వామీ! ఇలాగైతే నీ వాన, గాలి నువ్వే ఉంచుకో'' అని ఆ రైతు వాటిని దేవుడికే అప్పగించేశాడు. జీవితంలో అన్నీ సులభంగా సమకూరితే, ఆ జీవితం ఇలాగే ఉంటుంది. దానికి మించిన శూన్యం వేరొకటి ఉండదు.

రామ్ - 8096339900

www.ramkarri.com




# ఎదిగిన
# పిల్లల్లు,చెట్లు
# మన
# పెంపకపు
# క్రమశిక్షణకి
# సవాళ్లు

రామ్ - 8096339900

అయిదు సెకన్లు నవ్వితే చాలు –
ఫోటోగ్రాఫ్ ఆహ్లాదంగా ఉంటుంది.
అందంగా ఉంటుంది.

శుభదినం



అలాంటిది జీవితాంతం నవ్వుతూ ఉంటే
జీవితం ఎప్పుడూ ఆహ్లాదంగా ఉంటుంది.
అందంగా ఉంటుంది

రామ్ - 8096339900

కడలికి ఎల్లలుండవు
పుస్తక పఠనానికి పరిమితులుండవు.
ప్రతివారూ గర్వంగా చెప్పుకోగల
అలవాటు పుస్తక పఠనమే.

శుభదినం

రామ్ - 8096339900

వినయంగా వినడం,
వివేకంతో సమాధానమివ్వడం,
ప్రశాంతంగా ఆలోచించడం,
నిష్పాక్షికంగా నిర్ణయం తీసుకోవడం
ప్రతిమనిషికి అవసరం.

శుభోదయం

రామ్ - 8096339900




దేవుడు ఒక దుకాణం తెరిచాడట, అక్కడికి ఒక ఆసామి వెళ్లి 'ఇక్కడ ఏం దొరుకుతాయి?' అని అడిగాడు ఏది కావాలంటే అది దొరుకుతుంది' అన్నాడు దేవుడు.

'అలాగా, అయితే డబ్బు దొరుకుతుందా? 'చెప్పానుగా, దొరుకుతుంది.' 'మరి మనశ్శాంతి?' 'దొరుకుతుంది'...'ఆరోగ్యం?' ..'అది దొరుకుతుంది.' సుఖం? ఊ...తలూపాడు దేవుడు. 'ప్రేమ?' దొరుకుతుంది' కాస్త విసుగ్గా చెప్పాడు. సరే అయితే గెలుపు దొరుకుతుందా? .. 'చెప్పానుగా అన్ని దొరుకుతాయి, ' నీకేం కావాలో చెప్పు ముందు? ఇంకా క్యూలో చాలా మంది ఉన్నారు'

'ఊ.. అయితే నాకు సక్సెస్ ఫుల్ లైఫ్ కావాలి' సరే ఇదిగో అని ఒక గింజను చేతిలో పెట్టాడు దేవుడు. ఏమిటిది? ఆశ్చర్యంగా అడిగాడు విత్తనం ...ఎందుకిది ...సక్సెస్ ఫుల్ జీవితం కావాలన్నావుగా' దీంతో నాకేం పని?. ఇది ముందు నాటితేనే కదా, అది పెరిగి పెద్దదై నీకు ఫలితాన్నిచ్చేది.'

బుద్ధుడికి చెట్టు కింద జ్ఞానోదయం అయినట్లు ఆ చెట్టుకు మూలమైన విత్తనం చేతిలో పడగానే బల్బు వెలిగింది. దేవుడి దుకాణం లో పండు దొరకదు విత్తనం దొరుకుతుంది. ఏది కష్టపడకుండా ఏమి చేయకుండా రాదు. డబ్బా, శ్రమా, ఆలోచనా, ఇంకోటా...మరోటా..ఏదో ఒక పెట్టుబడి పెట్టాలి. ఏది నాటితే అదే కాస్తుంది. కానీ కచ్చితంగా కాస్తుంది. ఈ భావాన్ని మీ పిల్లల గుండెల్లో నాటండి. గొప్పవాళ్ళ వుతారు. ఆ దేవుడి దుకాణానికే విత్తనాలు పంపిస్తారు.

రామ్
8096339900

రామ్ - 8096339900

చాలా సార్లు ప్రేమ/స్నేహం సహచరుల్ని బందీలుగా
మార్చేస్తుంది. నిజానికి స్వేచ్ఛను కలిగించాలి.
ఎవరితోనైనా మాట్లాడితే చిరాకు పడతారు,
అనుమానిస్తారు, అవమానిస్తారు.
ఈ అనుమానాలు ముప్పావు వంతు జీవితాన్ని తినేస్తాయి.
మిగతా పావలా జీవితం సర్దుబాట్లతో గడిచిపోతుంది.
ఇక ప్రేమకు/స్నేహానికి చోటెక్కడుంది? నమ్మకం
లేనివి.... ప్రేమ/స్నేహం ఎలా అవుతాయి? నా
ప్రేమ/స్నేహం గొప్పది అని చెప్పుకునే బదులు నా
నమ్మకం గొప్పది అని చెప్పుకున్న రోజున ఆ ప్రేమ/స్నేహం
గొప్పదైపోతుంది.

బురదలో పుట్టి, బురదలో పెరిగినా
తామరపువ్వు స్వచ్ఛంగా ఉంటుంది.
ఇది మానసిక స్వచ్ఛతను సూచిస్తుంది.
ప్రతికూలత మధ్య కూడా తనను తాను
స్వచ్ఛంగా నిలుపుకునే గుణం మనకు ఆదర్శం.



శుభదినం

రామ్ - 8096339900

ముసిరిన చీకట్ల దగ్గరే ఆగిపోయేది కాలమే కాదు.
కమ్మిన మబ్బుల్ని చూసి కుంగిపోయేది వెలుగే కాదు.
పైన కప్పుకున్న నివురును చూసి నీరసపడేది నిప్పే కాదు.
చిన్న చిన్న దెబ్బలకు చితికిపోయేది అసలు జీవితమే కాదు.
అపజయాల్ని విలువైన అనుభవాలుగా మార్చుకుని
గాయాల్ని విలువైన పాఠాలుగా మల్చుకుని
ముందుకు సాగటమే జీవితం.

# శుభదినం

అవకాశాల కోసం , అనుభూతుల కోసం

కలలు కనండి.

కానీ, అద్భుతాల కోసం

కలలు కనకండి.ఎందుకంటే,

అవి అరుదుగా లభించేవే కానీ,

విరివిగా లభించవు.

రామ్ - 8096339900

విజ్ఞతను మించిన మిత్రుడు, అజ్ఞానాన్ని
మించిన శత్రువు లేడు. మన ఆలోచనలే
మనం ఏమిటి అనేది రూపొందిస్తాయి.
అందువల్ల మొదట ఆలోచనలు సవ్యంగా
ఉండేలా చూసుకోవాలి





www.ramkarri.com

ఓ క్షణాన్ని పోగొట్టుకుంటే
వెతుక్కోవటానికి జీవితకాలం పడుతుంది.
ఒక జ్ఞాపకాన్ని దాచుకుంటే
వదిలించుకోవటానికి జీవితకాలం పడుతుంది.

రామ్ - 8096339900

www.ramkarri.com

రామ్ - 8096339900

# కృషితో నాస్తి దుర్భిక్షం
# జపతో నాస్తి పాతకం
# మౌనేన కలహం నాస్తి
# నాస్తి జాగరతో భయం



కృషి చేసేవారికి కరువనేది ఉండదు. భగవన్నామ జపం చేసుకునేవారికి పాపముంటదు. మౌనంగా ఉండేవారికి కలహాలుండవు. జాగురుకతో ఉండేవారికి భయం ఉండదు.


ఇతరుల మంచిని మెచ్చుకున్నప్పుడే
నీలోని మంచి హెచ్చుతుంది.
శుభోదయం
www.ramkarri.com
రామ్ - 8096339900

మనసు నిర్మలంగా ఉంటే...
జీవితం ఆహ్లాదకరంగా
ఉంటుంది.

శు
భో
ద
యం

www.ramkarri.com

రామ్ - 8096339900

www.ramkarri.com



గుండుకి
పిలకందం!






నీ లైఫ్ కి
విజయం అందం


www.ramkarri.com
"ఓటమి" ని పరుగెత్తించు అది నిన్ను
"గెలుపు" దాక తీసుకెలుతుంది.
రామ్ - 8096339900

నమస్తే మిత్రమా..!!



మందలో ఒకరిగా ఉండకు
వందలో ఒకరిగా ఉండటానికి
ప్రయత్నించు

రామ్ - 8096339900 www.ramkarri.com

www.ramkarri.com

# శుభోదయం



నీ పట్ల ఇతరులు ఆసక్తి చూపాలనుకోవడం
కంటే ఇతరుల పట్ల
నీవు ఎక్కువ ఆసక్తి చూపినప్పుడు
ఎక్కువ స్నేహితులను పొందవచ్చు.

కష్టపడకుండా కేవలం
అదృష్టం
మీదనే ఆధారపడితే
వందజన్మలు
ఎత్తినా విజయాన్ని
సాధించలేము


రామ్ - 8096339900
ఆస్తి పెరగాలంటే మార్గాలు అనేకం..........
అభిమానం పెరగాలంటే ఆత్మీయత ఒక్కటే మార్గం.
www.ramkarri.com

మనం ఆనందంగా ఉండడానికి మంచి మార్గం
ఇతరులను ఆనందంగా ఉంచడమే

శుభోదయం నేస్తం

ఆకాశంలో ఒక గ్రద్ద ఆహారం కోసం చూస్తూండగా ఒక నక్క ఎరలతో నిండిన బండి లాగుతూ వెళ్తోందట. పైనుండి దీన్ని చూచిన గ్రద్ద రయ్యిమని ఆ నక్క ముందు వాలి, ఆ ఎరలు కావాలని నక్కను అడిగిందట, అప్పుడు ఆ నక్క ''తప్పకుండా ఇస్తాను. కాని కొంత వెల అవుతుంది'' అన్నదట. దానికి ఆ గ్రద్ద 'ఏమివ్వాలి, ఎంతివ్వాలి' అని అడిగితే, 'నీ రెండు ఈకలు ఇస్తే, నేను ఒక ఎరను ఇస్తాను' అని నక్క అన్నదట. గ్రద్ద తన రెండు ఈకలను పీకి ఇచ్చిందట. నక్క వాటిని తీసుకొని ఒక ఎరను తీసి ఇచ్చిందట. దాన్ని తింటూ 'ఆహా ఎంత రుచిగా ఉంది. మళ్లీ ఇంకొకటి తిందాం'' అని మళ్లీ నక్క దగ్గరకు వచ్చిందట. అలా రుచి మరిగి మళ్లీమళ్లీ తన ఈకలనిచ్చి ఎరలను కొంటూ వచ్చిందట. చివరకు ఆ గ్రద్ద ఈకలన్నీ అయిపోయాయి . అప్పుడు ఒక్కసారిగా నక్క పెద్దగా నవ్విందట. గ్రద్ద తేరుకొని, నిజం తెలుసుకొనే లోగా తన ఈకలన్నీ ఊడి, పైకి ఎగరలేకపోయింది. నక్క అమాంతం గ్రద్ద పైబడి చీల్చి తినేసింది. విచక్షణ కోల్పోయి శక్తినంతా అమ్ముకుని, దేవుడిచ్చిన ఎగిరే శక్తిని కోల్పోయి చివరకు ప్రాణాలు విడిచింది.

సరిగ్గా మన జీవితంలో కూడా, మనల్ని ఆకర్షించి, ప్రలోభపెట్టి మనకు తాత్కాలిక ఆనందాన్ని, ఆహ్లాదాన్ని ఇచ్చే విషయాలే మన పాలిట విషప్రాయాలై మన జీవితాలను విషాదంలో ముంచేస్తాయి. ఆకర్షణల ప్రలోభాల కారణంగా మన దృష్టి మరల్చబడుతుంది. మనిషి యొక్క లక్ష్యాన్ని, ఏకాగ్రతను, భగ్నంచేసే పరిస్థితులు, ప్రలోభాలు అడుగడుగునా ఎదురవుతూనే ఉంటాయి,

ఒక వ్యక్తి తన ముందున్న లక్ష్యాన్ని సాధించే ప్రయత్నంలో ఆకర్షణలు, ప్రలోభాల రూపంలో ఎదురవుతుంటాయి, ఎదుర్కొని తీరాల్సి వస్తుంది. రామ్ - 8096339900








రామ్ - 8096339900

జీవితంలో అన్ని ద్వారాలు మూసుకుపోయాయని
ఎప్పుడూ అనుకోవద్దు ! బహుశా మీరు వాటిని
తెరవడం కోసం అవి ఎదురుచూస్తున్నాయేమో !!

రామ్ - 8096339900

# శుభోదయం



సున్నితత్వం అంటే...

చిన్న చిన్న విషయాలకి బాధపడటం కాదు,

చిన్న చిన్న విషయాలకి ఆనందపడటం.

విశ్వం, దేవుడు...
రెండూ వేరు వేరు కాదు.
ప్రపంచమే ఒక భగవత్ స్వరూపం.
సృష్టికారుడి మాయ. ఆ అద్భుత స్వరూపాన్నే
మనం ప్రపంచంగా పిలుచుకొంటున్నాం.

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

సాలగ్రామశిల బంగారాన్ని తయారు చేయటంలో
ఉపకరిస్తుందంటారు. గీటురాయి బంగారాన్ని
పరీక్షిస్తుంది. ఈ రెండూ రాళ్లే. రెండూ నల్లనివే.
ఒకటి సువర్ణాన్ని పుట్టించేదయితే..
మరొకటి ఆ సువర్ణాన్ని పరీక్షించేది అయింది.
పరిశ్రమ సాలగ్రామమయితే..
ఓటమి గీటురాయి!!

నీ మనసును ఆహ్లాదకరమైన ఆలోచనలతో నింపు.
అలాంటి ఆలోచనలు నీ జీవితాన్ని
సుఖమయం చేస్తాయి.





రామ్ - 8096339900

పెంచుకుంటే పెరిగేవి మమతలు....
పంచుకుంటే తరిగేవి బాధలు...
పంచుకున్నా.. పెంచుకున్నా మిగిలేవి
జ్ఞాపకాలు ఒక్కటే....
కాలం కడగలేని ఒకే ఒక్క వస్తువు –
జ్ఞాపకం....



స్వతహాగా మంచివాళ్ళు గొప్పవాళ్ళే.
కొందరు మంచివాళ్ళు అనిపించుకోవటం
కోసం ఇతరులను చెడ్డవారుగా నిరూపించే
ప్రయత్నం చేస్తారు. కొందరు చెడ్డవాళ్ళే –
కాని మంచివాళ్ళు అనిపించుకోవటం
కోసం మంచివాళ్ళుగా నటిస్తారు.

మంచివాడు తన మనసులోంచి
మంచినే తీసిస్తాడు.
చెడ్డవాడు తన మనసులోంచి
చెడునే తీసి ఇస్తాడు.
మనసులో ఏ భావాలైతే
పొంగిపొర్లుతుంటాయో అవే
నోటి ద్వారా బైటికి వస్తాయి.
మనసులో ఉన్నదే మాటలలోకి
వస్తుంది. మాటలలో ఆత్మసంస్కారమే
వ్యక్తమవుతుంది.

పని చేస్తున్న ఆవిరి
ఎలాంటి శబ్ధాన్నీ చేయదు.
తప్పించుకు వెళ్తున్న ఆవిరే
విపరీతమైన శబ్ధాన్ని చేస్తుంది.



www.ramkarri.com

తల వంచి నడవకు నేస్తం
నీ చూపు నేలని తాకి ఆగిపోతుంది.

తలెత్తి అడుగు ముందుకు వేస్తే
అకాశంలోకి దూసుకుపోతుంది.

నమ్మకం మానవాళి మధ్య ఉండే
ఓ మహత్తర ప్రక్రియ.
నమ్మకం లేని చోట స్వేచ్ఛ వుండదు
నమ్మకం మనిషికి చాలా అవసరం.
కానీ దేన్ని నమ్ముతున్నా మన్నది
తెలుసుకోవడం
అంతకంటే అవసరం.
మంచిని నమ్మితే జీవితం
పూలతోట అవుతుంది.
చెడును విశ్వసిస్తే
బతుకు భారమైపోతుంది.

రామ్ - 8096339900

www.ramkarri.com



అందమైన శరీరం చూసి

మురిసిపోకండి...



ఎందుకంటే .....

దాని విలువ గుప్పెడు

బూడిద మాత్రమె....





www.ramkarri.com

మనసుకి తగిలే గాయాలన్నీ, ద్వేషాన్నీ ఏళ్ల తరబడి
మర్చిపోకుండా గుర్తుచేసుకుంటూ ఉంటాం.
కానీ ప్రేమని కొన్ని రోజులకోకసారి కొత్తగా తెలియబరుస్తూ
ఉండాల్సివస్తుంది.
ఇది విచిత్రమే కదా!
ద్వేషాన్ని సజీవంగా ఉంచేందుకు కొత్తగా అవసరం లేదు
ప్రేమని కొనసాగించేందుకు మాత్రం బైటనుంచి సాయం
కావాలి, అందుకే ప్రేమ తాలుకు ప్రదర్శననీ పెంచండి.



రామ్ - 8096339900


ఈ రోజు నువ్వు చేస్తున్న పని ..
రేపటి నీ గమ్యానికి
నిన్ను దూరంగానో,
దగ్గరగానో తీసుకెళ్తుంది.
రామ్ - 8096339900
www.ramkarri.com

రామ్ - 8096339900

అద్భుతం జరగడం కోసం
ఎదురు చూడకు,

నీకే అద్భుతాన్ని సృష్టించే
శక్తి ఉందని మరువకు.

www.ramkarri.com

Good Morning

www.ramkarri.com

ఆకులు తినే మేకలు
కొండలెక్కుతుంటే, ఆ
మేకలను తినే
మనుషులు మెట్లు
కూడా ఎక్కలేకున్నారు.

రామ్ - 8096339900



www.ramkarri.com

తీపిగా ఉన్న ప్రతీది అమృతం కాదు
చేదుగా ఉన్న ప్రతీది విషమూ కాదు

మంచి మాటలు చెప్పేవారంతా మంచివారు కారు
కఠినంగా మాట్లాడే వారంతా కఠినాత్ములు కారు



www.ramkarri.com

ఒకానొక దేశంలో ఓ రాజుగారికి దేశానికి వృద్ధులు అనవసరం అనిపించింది. యువకుల్లా వారు పనిచెయ్యలేరు, అందుకని ప్రతి ఒక్కరూ తమ ఇంట్లోని వృద్ధులను అడవిలో వదిలేయాలంటూ రాజు హుకుం జారీ చేశాడు. వృద్ధులను అడవిలో వదిలిపెట్టసాగారు. ముసలివారు ఆకలితో మరణించారో క్రూరమృగాల పాలపడ్డారో రాజుగారు పట్టించుకోలేదు. ప్రజలను పట్టించుకోనివ్వలేదు. ఓ రోజు ఒక యువకుడు తండ్రిని అడవికి తీసికెడుతూంటే తండ్రి "నాయనా, జాగ్రత్తగా నడు.. ముళ్లు గుచ్చుకుంటాయి" అన్నాడు. యువకుడు చలించిపోయాడు. ఇటువంటి ప్రేమమూర్తిని అడవిలో వదలకూడదని, రహస్యంగా ఇంటికి తీసుకొచ్చేశాడు. కొంతకాలానికి రాజుగారికి ప్రజల తెలివితేటలను పరీక్షించాలని కోరిక కలిగింది. ఒక కుండలో పెద్ద గుమ్మడికాయను పెట్టుకుని రమ్మన్నాడు. కుండ విరిగిపోకుండా గుమ్మడికాయను అందులో ఎలా పెట్టగలం? ఎవరూ చెయ్యలేని పని అని అంతా అనుకున్నారు. రహస్యంగా ఇంట్లో ఉంటున్న ఆ తండ్రి గుమ్మడి తీగకున్న పిందెను కుండలో దూర్చి పెట్టమన్నాడు. పిందె కుండలోపలే పెరిగి కాయగా మారింది. యువకుడు రాజుగారికి తీసికెళ్లి చూపించాడు. సంతోషించిన రాజు ఏదైనా బహుమతి కోరుకోమన్నాడు. యువకుడు క్షమాభిక్షను కోరుకుని, అసలు సంగతి రాజుతో చెప్పాడు. వృద్ధులు శారీరకంగా పని చెయ్యలేకపోయినా, తెలివితేటలతో ఉపయోగపడగలరని, వాళ్ళకి ప్రతి అంశంలోనూ ఆలోచన, ఒక అనుభవం ఉంటుందని రాజుకి అర్థమైంది.


మనసు ద్వేషంతో నిండిపోయి ఉన్నప్పుడు ఎదుటివారి
మాటలో తప్పు కనిపించి, ఆవేశపడతాం.
నిజానికి తేడా మాటలో లేదు,
దానిని స్వీకరించే మనసులో ఉంది.
www.ramkarri.com
శుభోదయం
రామ్ - 8096339900

జ్ఞానం శక్తిని ఇస్తుంది.

ప్రవర్తన గౌరవాన్ని ఇస్తుంది.

అరటిపండును తొక్క తీసి తింటాం. సపోటాను తొక్క తీసినా గింజ ఊస్తాం.
మామిడి పండును పైది తిని, లోపలది విసిరేస్తాం. సీతాఫలం మధ్యలో ఉన్న
గుజ్జు తింటాం, పై తొక్కు, లోపల గింజలు వదిలేస్తాం. యాపిల్, జామ పళ్ళని
మొత్తం తినేస్తాం. ఇలాగ మనం ఒక పండు లో టెంక, ఒకదాన్లో గింజ,
ఇంకోదాన్లో తోలు, మరొక దాన్లో తొక్క కాదనుకుంటాం. ఒక్కోటి ఒక్కో రుచి.
తీపి, పులుపు, వగరు కొంచెం తేడాలతో ఎన్నో రుచులు. అన్ని ఇష్టమే,
ఏది తిన్నా మనకు ఆరోగ్యమే. అయితే పళ్ళు తింటున్నప్పుడు మంచి
మాత్రమే గుర్తుంటుంది కాని చెడు గుర్తుండదు. మనకి కావాల్సింది తీసుకోని
అక్కర్లేనిది పారేస్తామంతే. అలాగే మనుషులు కూడా పళ్ళ లాంటివారే.
కుటుంబంలోని భార్య భర్త, అమ్మ నాన్న, అక్క చెల్లి, అన్న తమ్ముడు,
అందరు ఒక్కొరకం పండు, ఒక్కొక్కరిది ఒక్కో స్వభావం. అయితే అందరు
పళ్ళ లాగా మనకు మంచి చేసేవాళ్ళే. కాని మనిషి విషయంలో వాళ్ళు
చేసిన మంచి కంటే, వాళ్ళు చూపించిన కోపమో చిరాకో ఎక్కువ గుర్తుంటుంది.
పండులో అక్కర్లేని గింజ కూడా ఒక భాగమే అనుకుంటాం కానీ ద్వేషించం.
పండులాగే కోపతాపాలు, ప్రేమపాశాలు కలిస్తేనే మనిషి స్వభావం.
ఇది గుర్తించగలిగితే, వాళ్ళని ద్వేషించకుండా ప్రేమిస్తాం.
కుటుంబం అనేది " ఏ మిక్సిడ్ భ్యాగ్ ఆఫ్ ఫ్రూట్స్ "

అవతలి వ్యక్తికంటే ఎక్కువ తెలుసుకో...

అవతలి వ్యక్తికంటే ఎక్కువ పనిచేయి...

అవతలి వ్యక్తికంటే తక్కువ ఆశించు...

ఈ మూడే విజయానికి సూత్రాలు...



జ్ఞాన శిఖరాలు అధిరోహించడానికి మనిషి అత్యంత వ్యయ ప్రయాసలకు గురవుతూనే ఉన్నాడు. ఈ ప్రస్థానంలో అనేక కష్టనష్టాలు అనివార్యం. అయినా ఈ ప్రయాణం ఆగదు.

అసలు కష్టాలు, ఓటములు లేకుంటే ఇప్పటివరకూ ఇన్ని విజయాలు దక్కిఉండేవా?

మరి బతుకంతా సుఖంగా గడిచిపోవాలని నిత్యం భగవంతుణ్ని వేడుకుంటున్నాం

ఇది పరస్పర విరుద్ధంగా లేదూ?

రామ్ - 8096339900

సగర సుతుల హఠాన్మరణం వల్లనే భగీరథుడు దివినుంచి భువికి గంగను తెచ్చాడు.

సీతాపహరణం కారణంగానే రావణ సంహారం జరిగింది.

బాల్యంలో అష్టకష్టాలు పడిన తరవాతే శ్రీకృష్ణుడు కంసుణ్ని వధించాడు.

కొన్ని వందలసార్లు ప్రయత్నించి విఫలమైన థామస్ఆల్వా ఎడిసన్ విద్యుద్దీపం కనిపెట్టాడు.

కొన్ని దశాబ్దాలు శ్రమించాకనే రైట్ సోదరులు విమానం తయారు చేయగలిగారు.

కష్టాల వెనువెంటే సుఖాలుంటాయి. ఓటమే విజయానికి పునాది.

అందుకే మనందరం కష్టాలనే ఇష్టాలుగా మార్చుకోవాలి.



స్కూలు నుంచి వచ్చిన మనవడిని చూస్తూనే నాన్నమ్మ కంగారుపడింది. బొటనవేలికి గాయం చేసుకున్నాడు. రక్తపు చార కనబడుతోంది. నాన్నమ్మ మెడికల్ టేప్ తెచ్చి, మనవడి వేలు కడిగి, టేపు చుడుతోంది.

'ఇది ఎందుకు నాన్నమ్మా?' అన్నాడు మనవడు .

'ఈ టేపు వేస్తే లోపలి రక్తం బయటికి రాకుండా ఉంటుంది' అని చెప్పింది.

'వస్తే ఏమవుతుంది?' 'లోపల ఉండాల్సింది లోపల ఉంటేనే మంచిది. బయటికి వస్తే చెడిపోతుంది' అని వివరంగా చెప్పింది. 'నిజమే నాన్నమ్మా, వాడిని నేను తిట్టకుండా ఉంటే, వాడు నన్ను తోసేవాడు కాదు' నాన్నమ్మ చెప్పిందాన్ని తనకు అన్వయించుకున్నాడు మనవడు. 'మరి అలా నోటికి ఏది వస్తే అది అంటారట్రా. నీ చేతికి కాదు, నీ నోటికి వేయాలి టేపు' నవ్వుతూ అంది నాన్నమ్మ. 'టేప్ వేసుకోవాలా? మరి వాళ్లగురించి ప్రేమగా చెప్పాలనుకుంటే?' అడిగాడు మనవడు.

'ప్రేమను చెప్పడం ఎందుకు నాన్నా! చూపించాలిగానీ' అంది నాన్నమ్మ.

మన ఒంట్లో ఉన్నంతసేపే రక్తం మంచిది. బయటికి వస్తే చెడిపోతుంది. అలాగే, మన మాట కూడా. పైగా, మనసులోని భావాన్ని మాట ఎప్పటికీ యధాతథంగా వ్యక్తం చేయదు. అది చర్యలవల్లే సాధ్యమవుతుంది. అందుకే భద్రపరుచుకోవాల్సినవి మాటలు. వాటికి టేప్ వేయండి. యథేచ్ఛగా చూపాల్సింది ప్రేమ. బాగా చూపండి. అప్పుడు బంధాలు చెడిపోకుండా ఉంటాయి. టేపు వేసినట్టుగా అతుక్కుని ఉంటాయి.





రామ్ - 8096339900

ఒక మనిషి నైతిక ప్రవర్తనను,
అతని మంచితనాన్ని గ్రహించడానికి
అసలైన గీటురాయి అతడి గృహజీవితమే.
స్వేచ్ఛగా ఉండే గృహజీవితంలోనే...
మానసిక, నైతిక సంబంధాలు బాగుంటాయి.
అన్ని విషయాల్లోనూ పరస్పర
అవగాహన ఉంటుంది.

రాము - 8096339900



ఆ ఏడుకొండలవాని దయతో
అందరూ సుఖసంతోషాలతో
వర్ధిల్లాలని ఆశిస్తూ
అందరికీ

# శుభోదయం

www.ramkarri.com

www.ramkarri.com

ప్రేమించిన కొత్తలో ఉన్న ఆకర్షణ, పది సంవత్సరాల పాటు అదే సాంద్రతతో కొనసాగితే దాన్ని ప్రేమ అంటారు. ప్రేమించడానికి అవతలి వారి అభిప్రాయాలతో ఏకీభవించనవసరం లేదు. ఈ ప్రపంచంలో ఏ ఇద్దరి అభిప్రాయాలూ ఒకలా ఉండవు. అభిప్రాయ భేదం వేరు, గొడవ వేరు. అవతలివారి అభిప్రాయం గానీ, ప్రవర్తన గానీ. పనిగానీ నచ్చకపోతే, గొడవపడకుండా, తన భావాన్ని చెప్పగలగటం, ప్రేమకి సంబంధించిన ఒక గొప్ప కళ.

భాంధవ్యం చెడిపోతున్నప్పుడు, అవతలివారు అలిగినప్పుడు, అందమైన అనుభూతిని పంచుకోవలసి వచ్చినప్పుడు సంభాషణకి మించిన ప్రత్యామ్నాయం మరొకటి లేదు. అదే విధంగా, అందంగా కనపడాలంటే, చిరునవ్వుకి మించిన అలంకరణ మరొకటి లేదు.





అదృష్టాన్ని సరదాగా నమ్ముకో

కష్టాన్ని పూర్తిగా నమ్ముకో

నీదే విజయం

రామ్ - 8096339900

www.ramkarri.com

కోపంగా ఉండటం అంటే రగిలే నిప్పును
చేతితో పట్టుకోవడం లాంటిది.
దానిని ఇతరులపై విసిరే లోపలే
నిన్ను దహించి వేస్తుంది

-గౌతమ బుద్ధుడు

శ్రీ - 8096633900



నేడు బుద్ధ జయంతి

ఉదయించే సూర్యుడు చెప్తున్నాడు శుభోదయం

గుడిలోని దేవుని సుప్రభాతం చెప్తుంది శుభోదయం

బడికి వెళ్ళే పిల్లల అడుగు చప్పుడు చెప్తుంది శుభోదయం

వరి కోతకు వెళ్ళే రైతన్నల బండ్లు చెప్తున్నాయి శుభోదయం

మేలుకోండి మిత్రులార మేలుకోండి

అందరికీ

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

మనం బతకబోయే బతుకు వాళ్ళు.
మనం నడవబోయే దారి వాళ్ళు.
ఇప్పటి సమాజాన్ని మనకంటే ముందు
స్వప్నించినవాళ్ళు. దీని నిర్మాణానికి
మనకంటే ముందు రాళ్లెత్తిన వాళ్ళు.
చరిత్రకు ప్రత్యక్ష సాక్షులు వాళ్ళు.
వాళ్ళు మనవాళ్ళు. మన పెద్దలు.
వయోవృద్ధులు. ప్రతి అంశంలోనూ
వాళ్లకు ఒక అనుభవం ఉంటుంది;
ఆలోచన ఉంటుంది; తమదైన
దృష్టికోణం ఉంటుంది. గతాన్ని
భవిష్యత్తుతో ముడివేస్తూ వర్తమానంతో
జరిపే సంభాషణ వాళ్ల జీవితసారం




రామ్ - 8096339900

నలుగిరిపై ఆధారపడితే
అదృష్టాలను నమ్ముతావు



నీ కాళ్ళపై నీవు నిలబడితేనే
అద్భుతాలను సృష్టిస్తావు

వాదనలూ, విమర్శలూ కుటుంబ బంధాలని
తొలచి వేసే పురుగులు
తప్పుని వాదించటం కన్నా,
ఒప్పుని మెచ్చుకోవటం
అవతలి వారిని దగ్గర చేస్తుంది.

శుభ సాయంత్రం

రామ్ - 8096339900

www.ramkarri.com

జీవితం అనేక సంఘటనల గొలుసు.
జీవించడం అనేక అనుభవాల గొలుసు.

రామ్ - 8096339900

సంకల్పం మంచిది అయితే
సాధించే శక్తి దానంతట అదే వస్తుంది

ఎదుటివారిని చూచి ప్రేమపూర్వకముగా
నవ్వగలిగితే
అదే వారికి నువ్విచ్చే హృదయపూర్వక
బహుమతి.

రామ్ - 8096339900

తనకంటే తక్కువ వారితో
వ్యవహరించే తీరునుబట్టే
మనిషిలోని గొప్పతనం
తెలుస్తుంది.

# ఓ తండ్రి డైరీలో చివరి పేజీ

చిన్నా

అలసిపోయాను.నీరసపడిపోయాను, ముసలివాణ్ణి
దయచేసి నన్ను అర్థం చేసుకో! బట్టలు వేసుకోవటంకష్టం.
తువ్వాలేదో చుట్టబెట్టుకుంటాను. గట్టిగా కట్టుకోలేను.
అందుకే తొలగిపోతూంటుంది. కసురుకోకు,
అన్నం తింటునప్పుడు చప్పుడవుతుంది. చప్పుడు కాకుండా
తినలేను అసహ్యించుకోకు. నీ చిన్నతనంలో నువ్వు కూడా
ఇంతే..గుర్తు తెచ్చుకోరా, బట్టలు సరిగా వేసుకునేవాడివి కాదు.
అన్నం కూడా అంతే పెద్దగా శబ్దంచేస్తూ తినేవాడివి.
ఒకే విషయాన్ని పదేపదే చెబుతుంటాను. విసుక్కోకు,
స్నానం చేయటానికి ఓపిక ఉండదు.చేయలేదని తిట్టకు.
నువ్వుకూడా చిన్నప్పుడు స్నానం చేయమంటే
ఎంత ఏడ్పించే వాడివో గుర్తుందా?
తినాలని లేనప్పుడు తినలేను. విసుక్కోకు. కీళ్ళ నొప్పులు
నడవలేను. ఊతకర్ర నాతోనే ఉండాలి.
లేనప్పుడు నీ చేయి అందించి నడిపించు. నీకు నడక
వచ్చేవరకు నేను అలాగే నిన్ను వేలుపట్టుకుని నడిపించాను.
అందుకనేమో ముసలివాళ్ళు పసివాళ్ళతో సమానం
అంటారనుకుంటా! ఏదో ఒక రోజు, నాకు బతకాలని లేదు
చనిపోవాలని ఉంది అంటాను. అప్పుడు కోపం తెచ్చుకోకు,
అర్థం చేసుకో. ఈ వయసులో బతకాలని ఉండదు.
కాని బతకక తప్పదు. ముసలికంపు కొడుతున్నానని
అసహ్యంగా చూడకు. దగ్గరగా తీసుకుని కూర్చో
నీ చిన్నప్పుడు నువ్వు ఎలా ఉన్నా నేను అలాగే దగ్గరగా
తీసుకునేవాణ్ణి. నువ్వలా తీసుకుంటే ధైర్యంగా ఆనందంగా
హాయిగా నవ్వుతూ చనిపోతానురా!

www.ramkarri.com



ఎన్ని ఓటములు ఎదురైనా
నిన్ను నువ్వు
నిందించుకోకు.

ఆ ఓటములకు
కారణాలను తెలుసుకో,
పొరపాట్లు ఉంటే సరిదిద్దుకో,
ఎంత కష్టమొచ్చినా,
ప్రయత్నించడం మాత్రం ఆపకు

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవటానికి సమూహంలో
ఉండటం ఎంత అవసరమో,
ఊహాశక్తి పెరగటానికి ఏకాంతం
అంతే అవసరం.

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

www.ramkarri.com



ఉన్నవాడికి తిన్నది అరగదు

లేని వాడికి తిండి దొరకదు

అయినా చంద్రుడుకి ఏమి పట్టదు

విహారానికి ఉరకలువేస్తూ వస్తాడు

వెన్నెలమ్మలేనిదే అడుగు పెట్టడు

అదిచూసి అందరూ నిద్రా సమయమైందని

కలలలోకాలలోకి దుప్పటితో పయనమౌతారు

అందుకే అందరికి సంతోషరాత్రి ......

రామ్ - 8096339900

www.ramkarri.com




అనుకున్నవి ఏవి
జరగడం లేదని నిరాశ
పడకే మనసా!

దేముడైన రాముడు
కూడా పద్నాలుగేళ్ళు
వనవాసం చేసాడు
తెలుసా ?

www.ramkarri.com

www.ramkarri.com

www.ramkarri.com

శుభదినం

ఎంతమందిలో ఉన్నా నీకంటూ...
ఒక ప్రత్యేక గుర్తింపుతో
ఉండటానికి ప్రయత్నించు.

రామ్ - 8096339900

www.ramkarri.com

మన ఇళ్లల్లోగానీ, బంధుత్వాల్లో గానీ ఏదైనా పొరపాటు జరగగానే ముందు ఎదుటివాడిదే తప్పని తీర్మానిస్తాం. మనస్ఫూర్తిగానే ఎదుటివాళ్ళే తప్పు చేశారని నమ్ముతాం. ముఖ్యంగా మన కుటుంబ సంబంధాల్లో, భార్య తప్పు చేసింది అనేముందు భర్త, ఇది ఆయనవల్లే జరిగి ఉంటుందని అనుకునే ముందు ఆమె... ఒక్క సారైనా ఆలోచించాలి.  మనలో చాలామంది ఎదుటివాడు తప్పుగా ఉన్నాడని అనుకుంటాంగానీ, మన దగ్గర తప్పు ఉందని గుర్తించం. మన హృదయాన్ని గది అనుకుంటే కిటికీలు కళ్ళు వాటితో ఎలా చూస్తున్నామనే దాని బట్టి, సంబంధాలు ఆధారపడి ఉంటాయి. కళ్ళల్లో ఒక నలక పడితేనే ఎంతో చికాకుగా ఉంటుంది. అలాంటిది ఇతరులలో తప్పు ఎంచడమనే దుమ్ము మీ కళ్ళల్లో పేరుకు పోయుంటే ఎంత విసుగ్గా ఉంటుంది! సంబంధాలు ఎంతగా స్ట్రెయిన్ అవుతాయి! గుండె కిటికీలను శుభ్రంగా తుడుచుకోండి. అప్పుడు బంధాలన్నీ ఇంకా కొత్తగా, తేటగా కనబడతాయి.



రామ్ - 8096339900

అభిప్రాయాలను వెలిబుచ్చటానికి జంకకూడదు,
ఇతరులు తమ అభిప్రాయాలను
వెలిబుచ్చటానికి తగిన స్వేచ్ఛ వారికి
ఉందన్న విషయం మరువరాదు.

# శుభోదయం



చదువుకుంటున్నప్పుడు ఉన్న స్నేహితులందరి దగ్గరనుండి ఒక్కసారిగా వైదొలిగి ఉద్యోగాన్వేషణలో  ఉన్నాం, బిజినెస్ లో ఉన్నాం అంటూ  అప్పులందరికి దూరంగా ఉంటారు. ఒక ఉన్నత వర్గంలో చేరాకా వెనుతిరిగితే అక్కడ మీకోసం ఎవరు వేచి ఉండరు. మీరు అభివృద్ధి సాధించండి అందుకోసం మీ స్నేహం, మీ బంధుత్వం అడ్డుగా ఉందని మాత్రం తలవకండి.. మీ అభివృద్ధిని చూసి ఆనందించేవాళ్ళు, మీ ఉన్నతిని కోరేవారు, మీ సహాయం కోరేవారు అందరు.. మీరు వదిలేసినా మనుషుల మధ్యే ఉంటారన్నది అక్షర సత్యం. మీ ఉన్నతికంటే ముందు మీ చేయి పట్టుకుని మీ ప్రేమను పొందిన వాళ్ళు, మిమ్మలిని ప్రేమించేవాళ్ళు అందరూ అక్కడే ఉన్నారు. మీరు మీ ఉన్నతికోసం ముందుకు సాగండి కానీ, అందరినుంచి తప్పుకొని కాదు.. అందరిమధ్యా ఉంటూ ఆనందాన్ని అందుకుంటూ ముందుకు సాగండి...

మనిషి జీవితం ఒక పుస్తకమైతే, కథాంశం ఆనందం అయివుండాలి. అప్పుడప్పుడూ కొన్ని ట్విస్టులూ, విషాదాలూ ఉంటాయనుకో! అవి లేకపోతే కథలో ఇంటరెస్టు ఉండదుగా! జీవిత పుస్తకాన్ని బద్ధకమనే చెత్తకుండీలో పడేసి, నిర్లిప్తత అనే సాలెపురుగుల పాలు చేయకండి. మీ పుస్తకాన్ని మీరే ప్రేమించలేకపోతే ఇతరులు కనీసం దానివైపు కన్నెత్తి కూడా చూడరు. ప్రతిరోజూ దాన్ని చదువండి. బోల్డన్ని అచ్చు తప్పులు దొరుకుతాయి. గత అనుభవాల సాయంతో వాటిని సరిదిద్దేకొద్దీ జీవిత పుస్తకం మరింత అందంగా తయారవుతుంది.

ఆ ప్రూఫ్ రీడింగ్‌నే 'ఆత్మ పరిశీలన' అంటారు.

రామ్ - 8096339900

www.ramkarri.com


సంకల్పం మనసుకు సంబంధించింది అయినా దాన్ని ఆవలి ఒడ్డుకు
చేర్చడానికి బుద్ధి అనే ఓడ కావాలి.
ఓర్పుగా నడిపించగల జ్ఞానం కావాలి. ఇది చాలా అవసరం.
ఇలా సాగితే గెలుపు అనివార్యం.
రామ్ - 8096339900
www.ramkarri.com

మీరు వెళ్ళే దారిలో వచ్చిన మలుపు
ఆ దారికి ముగింపు కాదు
అక్కడే ఆగకుండా మలుపు దాటివెళితేనే
ముందుకువెళ్ళే దారి కనబడుతుంది

రామ్ - 8096339900

www.ramkarri.com

జీవితం కూడా అంతే


www.ramkarri.com
ఎన్ని అనుభవాల ఉత్తరాలు వేసినా
సాయంత్రానికి ఖాళీ అయ్యే
పోస్ట్ బాక్స్ లాంటిది మనసు.
రామ్ - 8096339900

భర్త రోజు వచ్చే టైం కన్నా రెండు గంటలు
ఆలస్యంగా వచ్చాడు. పిల్లలిద్దరు ఎదురు వెళ్ళిన
పట్టించుకోలేదు, మంచి మార్కులొచ్చాయి
అని చెప్పినా వినిపించుకోలేదు. విసుగ్గా బెడ్
రూమ్ లోకి వెళ్ళిపోయాడు.
పలకరించిన భార్య ని కసురుకున్నాడు. ఆమె
మూడ్ ఆఫ్ అయ్యింది. ఏదో అల్లరి చేసిన
పిల్లలని ఒక్కటేసింది.
భర్త తన మనస్తాపాన్ని భార్యకూ, పిల్లలకూ క్యారీ
చేశాడు. ఇల్లంతా స్విచ్ ఆఫ్ అయిపోయింది.
పిల్లలకైతే యూనిట్ టెస్టులనీ, క్వార్టర్లీ అనీ,
హాఫ్ ఇయర్లీ అని టీచర్స్ మార్కులేస్తారు....
మరి పెద్దయ్యాక?
మనకు మనమే మార్కులు వేసుకోవాలి. మన వల్ల ఒకరు
భాదపడిన రోజు మనకు సున్నా మార్కులు వచ్చినట్లు ...
మన వల్ల ఒకరు నవ్విన రోజు మనం డిస్టింక్షన్ లో పాస్ అయినట్లు....



శుభోదయం



ఎంత ఇస్తున్నామన్నది కాదు,
ఎంత ప్రేమగా ఇస్తున్నామన్నది ముఖ్యం.

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

శుభోదయం

అందమైన నిశ్శబ్ధాన్ని శబ్ధం పాడుచేస్తుంది.
నిశ్శబ్ధాన్ని కదిల్చే శబ్ధం ఒక పాటయితే –
మంచి సూక్తి అయితే అందంగా చెదిరిన
నిశ్శబ్ధం కూడా అస్తిత్వాన్ని పొందుతుంది.

రామ్ - 8096339900

www.ramkarri.com

19 వ శతాబ్దం లో ప్రాక్టర్ అండ్ గెంబుల్ కంపెనీ క్యాండిల్స్ తయారికి పెట్టింది పేరు. వాళ్ళ ఉత్పత్తులకు విపరీతంగా డిమాండ్ ఉండేది. అయితే ఎడిసన్ బల్బు కనుక్కున్నాక క్యాండిల్స్ వాడకం తగ్గిపోయింది. ఒక స్థాయిలో కంపెనీ దివాళా తీసేటట్లు ఉంది. కానీ దాని కథ ఇంకోలా మారింది. ఫ్యాక్టరీ లో పనిచేస్తున్న ఒక కార్మికుడు బోజనానికి వెళ్లేముందు తన మెషిన్ ఆపేయడం మర్చిపోయాడు. వచ్చి చూసేసరికి ఏముంది! యంత్రంచుట్టూ ముడిపదార్థం.... నురగ...ముందు దాన్ని పారేద్దామని అనుకున్నారు. కానీ ఆ క్షణం దాంతో సబ్బులు చేయిచ్చనే ఆలోచన వచ్చింది. విచిత్రంగా అలా తయారైన సబ్బు, నీళ్ళల్లో వేస్తె తేలింది. అప్పట్లో ఒహియో నదిలో జనాలు ఎక్కువ స్నానాలు చేసేవారు. సహజంగా సబ్బులు మునిగిపోయేవి. ఇదిగో ఈ తేలే సబ్బులకి డిమాండ్ వచ్చింది. మళ్ళీ కంపెనీ పేరు మార్మోగిపోయింది. ఇది ఐవరి సోప్ వెనుక ఉన్నా కథ. మనం అనుకోవచ్చు ఆ కంపెనీని ఆ సబ్బే నిలబెట్టిందని, కానీ నిలబెట్టింది సబ్బు కాదు. ఆ తప్పే కంపెనీని నిలబెట్టింది.

తప్పులు చేయండి, తప్పు చేయడం పెద్ద తప్పేమీ కాదు.
కానీ కొత్త తప్పులు చేయండి. వాటి నుంచి కొత్త విషయాలు తెలుసుకోవడానికి ప్రయత్నించండి. ఒప్పు జరగడానికి ముందు మెట్టుగా మాత్రమే తప్పని గుర్తించండి. అపుడు అది తప్పుగా అనిపించదు, అనుభవంగా మిగులుతుంది.









బాధ్యతల వత్తిడిలతో తీరికలేని పనులతో అందమైన బాల్యంపై మబ్బులు కమ్మినపుడు... బాల్యం అనే అమృతం కోసం...ఆ మబ్బుల్ని మనమే చిలకాలి..







ప్రతీ వ్యక్తి జీవితంలో బాల్యం
ఒక మధురానుభూతి..
ఓ అద్భుత వరం. జీవితంలో
ఒక్కసారైనా బాల్యాన్ని
తలచుకోని మనిషి ఉండడు.



మీ మనసులోనూ,
హృదయంలోనూ
మీకు శాంతి ప్రసాదించే
వాళ్ళనే ఉండనివ్వండి.
మిగతా వాళ్ళని
వెళ్ళిపోనివ్వండి...
అలజడి సృష్టించే వాళ్ళని
మీలో కాకుండా
బైటే ఉండనివ్వండి.
మీలో వాళ్ళకి
చోటివ్వకండి.

మనం ఏ పని బాగా
చేయగలమనేది ప్రతిభ.
మనం ఏ పనిని చేయడాన్ని అత్యంత
ఇష్టపడతాము అన్నది తపన.
మనం చేసే ఏ పని ప్రపంచానికి
అవసరమయి మనకు ధర
చెల్లిస్తుందో అదే అవసరం.
ఏది చేయాలని మనసు చెప్తుందో
అది అంతరాత్మ.

రామ్ - 8096339900

www.ramkarri.com

పాట వేలు పట్టి నడిపిస్తుంది.
ఎండ తగులుతున్నపుడు కాసింత నీడనిచ్చి సేద తీరుస్తుంది
కఠినమైన లోకం నుంచి ముఖం తిప్పుకోవాలనుకున్నపుడు
గొడుగు పట్టి చాటు ఇస్తుంది.
పాట ఒక ప్రపంచం. పాట నేనిది ఒక శూన్య ప్రపంచం.
రహస్యమైన సంతోషమేదో మనసులో నిండినప్పుడు
పంచుకోవడానికి ఏకాంతం లో తోడునిలుస్తుంది.
దిగుళ్ళలో మనసు గుబుళ్ళలో
ఒంటరి సాయంత్రాలలో
స్నేహితుల చేదైన ద్రోహ కాలాలలో
పాట నేనున్నానంటూ
కావలించుకుంటుంది.
అశ్రువులు తుడిచి
ఆదుకుంటుంది.



జీవించడానికి పోరాడేవారు కొందరు ....

పోరాడేందుకే జీవించేవారు కొందరు....

జీవితంలో నటించేవారు కొందరు

నటిస్తూ జీవించేవారు కొందరు...

జీవించినా , పోరాడినా , నటించినా....

ఆ జీవితాలు మనవి... దాని ఫలితం మనకే ...

యా దేవీ సర్వ భూతేషు శక్తి
రూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః

అల తానై అలరించేది ... మగువ
తనువు తానై మురిపించేది ... మగువ
ఒడి తానై మనిషినే మలిచేది ...మగువ
నింగినైనా నేలనైనా అమూల్యమైనదీ ...మగువ
ఎనలేని నిధియే ...మగువా...

రామ్ - 8096339900

వెన్న కరిగితే వేడికి నిదర్శనం

మనసు కరిగితే మానవతకు నిదర్శనం

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

భర్త ఆకలిగా ఇంటికి వచ్చాడు అన్నీటేబుల్ మీద ఉన్నాయి,
రెండు ముద్దలు నోట్లో పెట్టుకున్నాడో లేదో ఉప్పు విషంలా
నాలుక్కి తాకింది. భార్యను కేకేశాడు. వంటావిడ చేసింది
అని సంజాయిషీ ఇచ్చింది భార్య. మరుసటి రోజు అదే ఆకలితో భర్త
ఇంటికి వచ్చాడు. తృప్తిగా భోజనం చేశాడు. వంట చేసిన వాళ్ళని
మెచ్చుకోవాలనిపించి వంట మనిషి ని పిలిచి కూర చాలా బావుంది అని చెప్పాడు.
వంటావిడ సంతోషించింది. భార్యతో ఆ విషయాన్ని చెప్పాల్సిన అవసరం అతడికి
లేకపోయింది. ఈ రకంగా బాధ్యతలో ఉన్న ఆనందాన్ని భార్య కోల్పోయింది. ఇది
ఇళ్లల్లో ఆఫీసుల్లో తరచూ జరిగేదే.

మనం ఒక పనిని ఎవరినుంచయితే ఆశిస్తామో, వారు తగినవిధంగా స్పందించకపోతే,
ఇంకా కింది స్థాయిలో ఉన్న మనిషితో ఆ పని చేయించుకుంటాము.
అప్పుడు ఆ బాధ్యత ఉన్న మనిషికి బాధ్యత కరువు అవుతుంది.... మెల్లగా ఆ మనిషి
అవసరం కూడా క్షీణిస్తుంది! ఆ అవసరం లేని మనిషికి ఉనికి లేకుండా పోతుంది.
వర్క్ ఈజ్ వర్షిప్... పని దైవ సమానం అయితే .... బాధ్యత దీవెన లాంటిది!
బాధ్యతగా ఉండండి.... నలుగురికి మహాప్రసాదాన్ని పంచిపెట్టండి.
కడుపునిండా దీవెనలను పొందండి.

రామ్ - 8096339900

www.ramkarri.com

మబ్బు మసకేసినప్పుడు,
మంచుదుప్పటి కప్పేసినప్పుడు,
నలుదిక్కులా మౌనం కమ్మేసినప్పుడు..

వినే మనసుండాలే కాని
నీటి నుంచి సంగీతం వినిపిస్తుంది.
ఈ చల్లని నీళ్లలో ఏ ఊసులు దాగెనో!

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

ఓ వ్యవసాయ భూమి సమీపంలో నిల్చున్న ఒక మనిషి దృష్టి అక్కడ ఉన్న ఓ గడ్డిబొమ్మపై పడింది. ఆ బొమ్మ వంకే ఆయన చూస్తూ నిల్చున్నారు.

దానిని చూసి మనిషి "నువ్వు ఇలా రోజుల తరబడి ఇక్కడ నిల్చున్నావు. నీకు విసుగేయడం లేదా?" అని అడిగాడు.

దానికి ఆ బొమ్మ ఇలా చెప్పింది "నాకే విసుగూ లేదు. ఇటుగా వచ్చే పక్షుల్ని భయపెట్టడంలో పొందుతున్న ఆనందం మరెందులోనూ దొరకడం లేదనుకో. పక్షులు నన్ను చూసి భయపడి ఎగిరిపోయే తీరుని మాటల్లో చెప్పలేను. కనుక కాలం ఎలా గడిచిపోతోందో తెలియనే తెలీదు."

ఆ మాటలతో మనిషి ఆలోచించాడు.

కాసేపు తర్వాత ఆయన "నిజమే. ఈ ఆనందాన్ని నేనూ అనుభవించాను మనల్ని చూసి ఇతరులు భయపడేటప్పుడు కలిగే ఆనందాన్ని మరి దేనితోనూ పోల్చలేను" అని అనగా బొమ్మ "నిజం. నాలోపల గడ్డి, ఒకింత మట్టి తప్ప మరేమీ లేదు. నాలాగే లోపల గడ్డి, మట్టి నింపిన వాళ్ళు తప్పకుండా ఆనందం అనుభవిస్తారు" అని చాలా మామూలుగా చెప్పింది.

ఈ మాటలు మన జీవితాన్ని ఫొటో తీసి చూపుతోంది.

రామ్ - 8096339900




www.ramkarri.com

www.ramkarri.com




www.ramkarri.com

రామ్ - 8096339900

# శుభదినం

మీరు ఎదుటివారిపట్ల
ఉండే విధంబట్టి కాక,
వాళ్ళు మీతో ఎలా ఉండగలుగుతారో
అనే దాన్నిబట్టే మీ ప్రేమని
అవతలివారు గ్రహించగలుగుతారు.
మీ ప్రేమలో, దాని సువాసనలో,
మీరు ప్రేమించే వ్యక్తులను
పువ్వుల్లా వికసించనివ్వండి.

www.ramkarri.com

ఊపిరిలోనికి వస్తున్నప్పుడు
నువ్వు నాలోకి ప్రవేశిస్తున్న అనుభవమై
హృదయం పొంగుతుంది.
శ్వాస బయటికొస్తుంటే నువ్వు
వెళ్ళిపోతున్నావన్న బాధతో
కడుపుతరుక్కుపోతుంది.
ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసల్లో కూడా
నీవే నిండి ఉన్నావన్న ఆనందంతో
గుండె నిండుతోంది.

రామ్ - 8096339900

www.ramkarri.com

రామ్ - 8096339900



వివిధ విషయాలను
ఎదుటివారి దృష్టి
కోణంనుండి పరిశీలించే
సామర్థ్యం కలిగివుండటం
ఏకైక విజయరహస్యం.

I'm Sorry

జీవితంలో భార్యాభర్తల మధ్య, కుటుంబ
సభ్యులమధ్య, బిజినెస్ పార్టనర్స్ మధ్య,
వ్యక్తుల మధ్య వివాదాలు తలెత్తినపుడు 'సారీ'
అనే రెండక్షరాల మాట అద్భుతాలను
చేయగలదని గ్రహించినవారు అదృష్టవంతులు.
ఆలా ఒకరికొకరు 'సారీ' చెప్పుకుంటే
మనస్పర్థలు ఉండవు.



ఒక ఇంటి యజమాని ఒక వర్షపు రాత్రి తన జీవితంలోని సమస్యలను తీర్చమని దైవప్రార్థన చేయసాగాడు. వర్షం పెద్దదై భయంకరమైన తుఫానుగా మారింది. పక్క గదిలో నిద్రపోయే అతని చిన్న కొడుకు ఆ ఉరుముల శబ్దానికి మెలకువ వచ్చి ఉలిక్కిపడి లేచి తన తండ్రి దగ్గరకు వెళ్లి చెప్పాడు. "నాన్నా! నేను నిద్రపోయే దాకా నువ్వు నా పక్కనే ఉండు." తండ్రి లేచి వెళ్ళి కొడుకు పక్కనే పడుకున్నాడు. నిద్ర పట్టబోయేముందు ఆకస్మాత్తుగా అతనికి కొడుకు తనని కోరిన మాటలు గుర్తుకు వచ్చాయి.

"నాన్నా! నేను నిద్రపోయే దాకా నువ్వు నా పక్కనే ఉండు."

వాడు తుఫానుని వెళ్ళిపోమ్మనేలా కోరలేదు! అది వెళ్ళేదాకా తనతో ఉండమన్నాడు! అది ఎంత మంచి ఆలోచన అని తండ్రికి అనిపించింది. కష్టాలు అనే ఆ తుఫాన్లని తనకి దూరం చెయ్యమని ప్రార్థించేకంటే, అవి వచ్చినప్పుడు పరమాత్ముని తనకి తోడుగా ఉండమని ప్రార్థించడం మంచిది అనుకున్నాడు.

నా జీవితంలోనివి కష్టాలు కాదు...
అవి భగవంతుని వరాలు....

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

నిత్య సంఘర్షణలతో సతమతమయ్యే మానవుని మనస్సే ఒక కురుక్షేత్రం. శరీరమే రథం దానిని నడిపించే ఇంద్రియాలే అశ్వాలు. సమస్యపూరితమైన అహంకారమే అర్జునుడు. పరిష్కారం చేసే బుద్ధి, వివేకాలే కృష్ణుడు. అంటే చేతనాచేతన మనుషుల మధ్య సంవాదమే

భగవద్గీత.



ఇద్దరి మధ్య ఉండే సంబంధంలో తప్పెవరిది అన్నది కాదు ప్రశ్న,
జీవితం ఎవరిది అనేదే అసలు ప్రశ్న!
స్పందించటం సానుకూలమైనది, ప్రతిక్రియ వ్యతిరేకమైనది.
ఎదుటివాళ్ళ ప్రవర్తన బట్టి మీ ప్రవర్తన మార్చుకోవద్దు. ఏం
చేసినా...మీ వ్యక్తిత్వాన్ని బట్టే జీవించండి. తప్పు కి తప్పు అనే
స్పందన సరైనది కాదు..

అనుభవాల ద్వారా ఇతరులకన్నా మెరుగ్గా
ఎలా ఉండాలో నేర్చుకోవాలి, అంతేకానీ
వాళ్ళు ప్రవర్తించినట్టే.. ప్రవర్తించటం కాదు.
ఈ ప్రపంచం వల్ల జీవితాన్ని అందంగా
ఉండనివ్వండి.
ఈ ప్రపంచం ఎలా ఉన్నా జీవితం అందంగా
ఉండేట్టు చూసుకోండి .

గెలవాలి అనుకునే వారు ఎప్పుడు ముందే ఉంటారు ఏందుకంటే
వారి గురి అంతా గెలుపు పైనే ఉంటుంది, తనకన్నా ముందున్న
వారిని వెనుకకు లాగాలి అనుకునే వారు ఎప్పుడు వెనుకకే
ఉంటారు ఏందుకంటే వారి దృష్టి వెనుకకే వుంటుంది.



స్కూలు నుంచి వచ్చిన మనవడిని చూస్తూనే నాన్నమ్మ కంగారుపడింది. బొటనవేలికి గాయం చేసుకున్నాడు. రక్తపు చార కనబడుతోంది. నాన్నమ్మ మెడికల్ టేప్ తెచ్చి, మనవడి వేలు కడిగి, టేపు చుడుతోంది.
'ఇది ఎందుకు నాన్నమ్మా?' అన్నాడు మనవడు .
'ఈ టేపు వేస్తే లోపలి రక్తం బయటికి రాకుండా ఉంటుంది' అని చెప్పింది.
'వస్తే ఏమవుతుంది?' 'లోపల ఉండాల్సింది లోపల ఉంటేనే మంచిది. బయటికి వస్తే చెడిపోతుంది' అని వివరంగా చెప్పింది. 'నిజమే నాన్నమ్మా, వాడిని నేను తిట్టకుండా ఉంటే, వాడు నన్ను తోసేవాడు కాదు' నాన్నమ్మ చెప్పిందాన్ని తనకు అన్వయించుకున్నాడు మనవడు. 'మరి అలా నోటికి ఏది వస్తే అది అంటారట్రా. నీ చేతికి కాదు, నీ నోటికి వేయాలి టేపు' నవ్వుతూ అంది నాన్నమ్మ. 'టేప్ వేసుకోవాలా? మరి వాళ్లగురించి ప్రేమగా చెప్పాలనుకుంటే?' అడిగాడు మనవడు.
'ప్రేమను చెప్పడం ఎందుకు నాన్నా! చూపించాలిగానీ' అంది నాన్నమ్మ.

మన ఒంట్లో ఉన్నంతసేపే రక్తం మంచిది. బయటికి వస్తే చెడిపోతుంది. అలాగే, మన మాట కూడా. పైగా, మనసులోని భావాన్ని మాట ఎప్పటికీ యధాతథంగా వ్యక్తం చేయదు. అది చర్యలవల్లే సాధ్యమవుతుంది. అందుకే భద్రపరుచుకోవాల్సినవి మాటలు. వాటికి టేప్ వేయండి. యధేచ్ఛగా చూపాల్సింది ప్రేమ. బాగా చూపండి. అప్పుడు బంధాలు చెడిపోకుండా ఉంటాయి. టేపు వేసినట్టుగా అతుక్కుని ఉంటాయి.



రామ్ - 8096339900

ఎంత మధురం నీ నామం
ఎంత మోహనం నీ రూపం
ఎంత చూసినా తనివి తీరదే
ఎంత వేడినా వేళ చాలదే
శ్రీనివాసా చిద్విలాసా
తిరుమలేశా వెంకటేశా





రామ్ - 8096339900

# రూపాయి




సకల పాప కారిణి
సకల పాప నివారిణి
సకల దోష కారిణి
సకల దోష నివారిణి
సకల రోగ కారిణి
సకల రోగ నివారిణి
సకల కలహా కారిణి
సకల కలహా నివారిణి
సకల శత్రు కారిణి
సకల శత్రు నివారిణి
సకల భోగ కారిణి
సకల భోగ నివారిణి
బొమ్మ భాగం మంచితే
బొరుసు భాగం చెడ్డలే!
మొత్తంగా జీవితమంతా
బొమ్మా బొరుసుల ఆటలే!

రామ్ - 8096339900

నీ మనసును ఆహ్లాదకరమైన ఆలోచనలతో నింపు.
అలాంటి ఆలోచనలు నీ జీవితాన్ని
సుఖమయం చేస్తాయి.



www.ramkarri.com

రామ్ - 8096339900

అదుపుగా ఉంచాల్సింది నోరు

పొదుపుగా ఉంచాల్సింది నీరు

తిరిగిరాదు పారిన జలం, వెనక్కిరాదు జారిన పదం




ఇకనైనా జాగ్రత్త పడదామా మనం

www.ramkarri.com

గింజ మొలకెత్తుతున్నప్పుడు 'నో సౌండ్'.
చెట్టుకూలుతున్నప్పుడు మాత్రం
'భయంకరమైన సౌండ్'
డిస్ట్రక్షన్ హ్యాజ్ నాయిస్,
క్రియేషన్ ఈజ్ క్వయిట్.
సో బి క్వయిట్ అండ్ క్రియేటివ్!

రామ్ - 8096339900



గుడ్ మార్నింగ్ ఫ్రెండ్స్

www.ramkarri.com

మానవజాతికి అపారమైన తెలివితేటలు...
అద్భుతమైన మేధోశక్తి వుంది...!




కానీ నేనే గొప్ప అనే అహం , గర్వం మనిషి...
జీవితాన్ని,ఎదుగుదలను వెనక్కి నెట్టేస్తుంది..!

మాటల్లో చెప్పలేనిది అక్షర రూపంలో చెప్పొచ్చు. మాటల్లో చెప్పడం కంటే లేఖలో చెబితే కొన్ని అందంగా ఉంటాయి కూడా. పైగా మాటలు గాల్లో కలిసిపోతే, అక్షరం శాశ్వతంగా ఉంటుంది. నువ్వు నాకు ప్రత్యేకం అని చెప్పడానికి లేఖ రాస్తాం. ఇలా ఎలా చూసినా లేఖ రాయటం ఒక అందమైన అనుభవం.

దేవుడు మనుషులనూ ప్రేమనూ సృష్టించాడు. ఆ ప్రేమను అందుకోవడానికి మనిషికీ మనిషికీ మధ్య వారధి మనమే కట్టాలి. దానికి అవసరమైన కమ్యూనికేషన్ ను మనమే సృష్టించుకోవాలి. కమ్యూనికేషన్ ఉన్న చోట గ్యాప్ ఉంటుంది. ఇంకా ఏదో చిన్న వెలితి, కనపడని అగాదం, బయటపడని అశాంతి..... ఆ ఖాళీని పూడ్చడానికి మనం లేఖ రాయాలి రెండు వైపులా ప్రేమలో కూడా వన్ సైడ్ కమ్యూనికేషన్ అవసరం.

ఒకప్పుడు లేఖ చేరాలంటే రోజులు పట్టేది. ఇపుడు ఆ దూరం చెరిగిపోయింది. కానీ మనుషుల మధ్య మానసికంగా ఇంకేదో దూరం వచ్చింది, ఆ దూరం పోవాలంటే  మీ భావాలకి అక్షరం రూపం ఇవ్వండి. మీ తల్లిదండ్రులకో, భార్యకో, భర్తకో, పిల్లలకో రాసి అది వారి దిండుకింద పెట్టండి. ఆ చిన్న చిన్న దూరాల్ని తొలగించుకోండి, దగ్గరైపోండి.

శ్రీకృష్ణపరమాత్మ నిత్యజీవితంలో ఎన్నో వస్తువులు ఉపయోగిస్తున్నప్పటికీ ఒక వస్తువును మాత్రం అహర్నిశలు వదలక తన దగ్గరే ఉంచుకునేవాడు. అదే మురళి. ఆ వేణువును తన పెదవుల దగ్గర చేర్చి మధురమైన రాగాలను వినిపించి, అనంతరం దుస్తులలో భద్రపరచుకునేవాడు. ఏనాడూ దూరంగా ఉంచలేదు. అది చూసిన రుక్మిణీదేవి 'ఈ పిల్లన గ్రోవి ఎంత అదృష్టం చేసుకుంది, నిరంతరం శ్రీకృష్ణుని సాన్నిధ్యాన్ని అనుభవిస్తోంది. అంతటి భాగ్యం కలగడానికి పూర్వజన్మలో ఎన్ని తపస్సులు చేసిందో! అటువంటి పుణ్యాన్ని నేను ఈ జన్మలో ఆచరిస్తే కనీసం మరుజన్మలో అయినా నా స్వామికి సమీపంగా ఉండవచ్చు' అనుకుంది.

శ్రీకృష్ణుడు రుక్మిణి మనసు గ్రహించి నిద్రపోతున్నట్లు నటించి మురళిని దూరంగా పడేశాడు. రుక్మిణి మురళికి ప్రాణప్రతిష్ఠ చేసి మాట్లాడేశక్తిని ప్రసాదించి, ''మురళీ! నీవు జగత్ప్రభువైన శ్రీకృష్ణుని దివ్యసాన్నిధ్యాన్ని నిరంతరం అనుభవిస్తున్నావు కదా, పూర్వజన్మలో ఏ వ్రతం చేశావు? ఈ వివరాలు నాకు చెబితే నేను కూడా వాటిని ఆచరించి స్వామికి చేరువ అవుతాను'' అని అడిగింది. అప్పుడు ఆ మురళి ''అమ్మా! పుణ్యం, పాపం నాకు తెలియదు. నేనెవరినో కూడా నాకు తెలియదు. నా స్వరూపాన్ని పరీక్షించు, నా లోపల ఏమున్నదో బాగా చూడు'' అని చెప్పింది. రుక్మిణి మురళిని చేతిలోకి తీసుకుని లోపల ఏముందోనని పరిశీలించింది. అయితే లోపల అంతా ఖాళీగా ఉంది. అదే విషయం మురళితో చెప్పింది. అప్పుడు మురళి ''అమ్మా! నా లోపల అంతా ఖాళీగా ఉంది. అదే నా విశేషం. నేను ఏ విధమైన పదార్థాన్ని నాలో దాచుకోలేదు. నా అంతరంగం ఖాళీగా ఉంది. అదే నా విశేషం. అందుకే శ్రీకృష్ణునికి అతి చేరువ కాగలిగాను. నాలాగే ఎవరైనా చెడు సంస్కారాలయందు, ప్రాపంచిక విషయాలయందు ఆసక్తిని లేకుండా ఉంటారో, అదేవిధంగా దుర్గుణాలను త్యజించి మనస్సును నిర్మలంగా ఉంచుకుంటారో అటువంటివారు భగవంతునికి అతి సమీపంగా ఉంటారు. మనశ్శుద్ధియే దైవప్రాప్తికి మూలం''.మురళి చెప్పిన దానిని విని రుక్మిణి పరమానందం భరితమైంది..

ఓసారి ఓ వ్యక్తి ఒక జెన్ గురువును పరీక్షించాలనుకున్నాడు.
ఒక పక్షి మెడను చేతితో గట్టిగా నొక్కిపెట్టాడు. రెండు చేతులూ
వెనక్కి పెట్టుకుని, గురువు దగ్గరకు వెళ్లాడు.
'గురువుగారూ, నా చేతిలో ఓ పక్షి ఉంది. అది ప్రాణాలతో
ఉందా, చచ్చిపోయిందా' అనడిగాడు.
ప్రాణాలతో ఉంది అని గురువు అంటే పీక పిసికి చంపేయాలని,
చనిపోయింది అంటే ప్రాణాలతో గాల్లోకి ఎగరేద్దామని
అనుకున్నాడు. అతని ఆంతర్యాన్ని గ్రహించిన గురువు చిన్నగా
నవ్వాడు. గురువు మాట్లాడకపోవడంతో
ఆ వ్యక్తి మళ్లీ అడిగాడు-
'నా చేతిలో ఉన్న పక్షికి ప్రాణం ఉందా?'
గురువు చెప్పాడు.
'పక్షి ప్రాణం నీ చేతుల్లో ఉంది' -
రామ్ - 8096339900



తెగిపోయేటప్పుడే దారం
బలం తెలుస్తుంది..
విడిపోయేటప్పుడే బంధం
విలువ తెలుస్తుంది..

మంచిమనిషితోస్నేహం చేయి,
కానీ దూరం చేసుకోకు....

www.ramkarri.com

స్వార్ధపరున్ని దూరం చేసుకోగాని
శత్రువుగా మార్చుకోకు...

రామ్ - 8096339900

వివేకవంతులు తమని ప్రపంచానికి
అనుగుణంగా సర్దుకుంటారు,
కేవలం అవివేకులు మాత్రమే
ప్రపంచాన్ని తమకు అనుగుణంగా
సరిదిద్దాలని పట్టుపడతారు

రాము - 8096339900

www.ramkarri.com

శుభోదయం నేస్తం

నిన్న అన్నది గతం

రేపు అన్నది సంశయం

నేడు అన్నది నిజం

అలాంటి ఈ రోజు మీరు

ఆనందంగా గడపాలని

మనస్ఫూర్తిగా కోరుకుంటూ..

మీకు శుభోదయం



ప్రతి రోజూ ప్రత్యేకమైనదే..! ప్రతి రోజూ ప్రత్యేకమైనదే..!

రాము - 8096339900

తన చుట్టూ ముళ్ళున్నా
విరియుట మానునా విరులు

తన చుట్టూ బురద ఉన్నా
వికసించదా కమలము

వట వృక్షపు నీడనున్నా
మొలకెత్తదా విత్తనము





జీవితానికి ఒక ఆశయం ఉంటే
ప్రతికూల పరిస్థితులు
ప్రతిబంధకాలు కాలేవు ఏనాడూ.....

సముద్రంలో ప్రయాణిస్తున్న ఓ నావ అకస్మాత్తుగా ప్రమాదానికి గురయింది. అందులో కేవలం ఒక్క వ్యక్తి మాత్రం అదృష్టవశాత్తూ బతికి బయటపడి ఒక కొయ్య దుంగమీద తేలుతూ జనసంచారం లేని ఒక దీవిలోకి వచ్చి పడ్డాడు. ఆ ప్రమాదం నుంచి రక్షించమని రోజూ భగవంతుని వేడుకుంటూ ఉన్నాడు. ఎవరైనా తనను రక్షించడానికి వస్తారేమోనని సముద్రం వైపు ఆశగా ఎదురు చూసేవాడు. చూసిచూసి విసిగి పోయాడు. ప్రకృతి శక్తుల నుండి రక్షణ కోసం తేలుతూ వచ్చిన చెక్కలతో ఒక చిన్న గుడిసె నిర్మించుకున్నాడు. ఆ గుడిసెలో అలల తాకిడికి కొట్టుకు వచ్చిన కొన్ని పనికొచ్చే వస్తువులు దాచుకున్నాడు. ఒక రోజు ఆహారం కోసం వెళ్ళి తిరిగి గుడిసె దగ్గరకు వచ్చే సరికి అది తగలబడిపోయి పొగలుపైకి లేస్తున్నాయి. తనకున్న ఒక్క ఆధారం కూడా అగ్నికి ఆహుతైపోయిందని బాధతో కుంగిపోయాడు, దు:ఖిస్తూ అలాగే నిద్రపోయాడు. తెల్లవారి లేచి చూసేసరికి ఒక నావ అతనుండే దీవిని సమీపిస్తూ కనిపించింది. అది అతన్ని రక్షించడానికే వచ్చిందని తెలిసిన అతని ఆనందానికి అవధుల్లేవు. ఆ నావలోని వాళ్ళని ''నేను ఇక్కడున్నానని మీకెలా తెలిసింది?'' అని అడిగాడు. ''నువ్వు పొగ ద్వారా మాకు సంజ్ఞలు చేశావు కదా, దానిని గుర్తు పట్టే ఇక్కడికి రాగలిగాం'' అన్నాడు.

ఒక్కోసారి మన ఆశల సౌధాలు ఇలాగే తగలబడి పోవచ్చు.
కానీ అదే మంటలు ఏ భగవంతుని రాకకో సంకేతం కావచ్చు.

రామ్ - 8096339900

శత్రువుతో యుద్ధం - మనం శాంతికోసం
చెల్లించే మూల్యం.

సమస్యతో యుద్ధం - మనశ్శాంతి కోసం
చెల్లించాల్సిన మూల్యం.

రామ్ - 8096339900

గమ్యం అనేది ఒక అవకాశం కాదు,
అది ఎన్నుకోవలసిన ఒక లక్ష్యం.
అది ఎదురు చూడాల్సిన వస్తువు కాదు,
కృషి తో సాధించాల్సినది.

శుభోదయం మిత్రమా !

రామ్ - 8096339900

www.ramkarri.com





ప్రేమంటే అవతలివారిని అర్థం చేసుకోవటం ఒకటే కాదు. అవతలి వారి చేత అర్థం చేసుకోబడటం కూడా!

ప్రేమంటే చిరునవ్వు. ప్రేమంటే ఆనందం. ప్రేమంటే దయ, ప్రేమంటే కరుణ, ప్రేమంటే తీసుకోవడం కాదు, ఇవ్వడం.



పదమూడేళ్ల కుర్రవాడికి వాళ్ల అన్నయ్య అమెరికా నుంచి కొత్త సైకిల్ పుట్టిన రోజు బహుమతిగా పంపించాడు. పక్కింటి ఎనిమిదేళ్ళ కుర్రవాడిని ఎక్కించుకొని తొక్కుతున్నాడు.

అద్భుతంగా ఉన్నది సైకిల్.
చిన్నవాడు థ్రిల్ అయ్యాడు. “ఎక్కడిదీ సైకిల్” ?
“మా అన్నయ్య అమెరికా నుంచి పంపాడు”?
“ఎంత బావుండేది నాక్కూడా..” ఆగాడు చిన్న కుర్రాడు.
ఏమిటి? నీక్కూడా?
“ఓ అన్నయ్య అమెరికాలో ఉండి ఇలా సైకిల్ పంపిస్తేనా?
“కాదు. నాక్కూడా తొందరగా వయసొచ్చి, అమెరికా వెళ్ళి మా తమ్ముడికి ఓ సైకిల్ పంపిస్తే” అన్నాడు అతడు. అదీ ప్రేమంటే.





ఎన్ని యుగాలు మారినా... ఎన్ని తరాలు దాటినా...
మారని మాధుర్యం అమ్మ ప్రేమ

ఏ దేశమేగిన... ఏ తీరం దాటినా...
మరువని మమకారం అమ్మ ప్రేమ.

ప్రకృతి చేసిన బంగారు ప్రతిమా..
ప్రతి గుండె చేసే సడిలోని భావమా...

పాదాభివందనం నీ కమ్మా...
ఈ పాదాల వందనం నీ కోసం అమ్మ.

రామ్ - 8096339900

అన్నివైపుల నుంచి సెగ.... నలువైపుల నుంచీ విసిగించే వేడి.
చిన్నప్పుడు చదువు కోసం అమ్మా నాన్నా పోరు ...
పెళ్లయ్యాక సంసారంలో బాధ్యతల పోరు ...
ఆఫీస్‌లో నిత్యం పని పోరు............ ఇలా అన్ని చోట్లా సెగ .
జీవితం కూడా ఓ మంటగానే అనిపిస్తోంది.
ఎర్రటి నిప్పుల మీద చిటపటమంటున్న మొక్క జొన్న పొత్తులు,
మంటలపై కాలుతున్న పెనంపైన ఇసుకలో వేగుతున్న వేరుశెనక్కాయలు.
వాటికి నిప్పుల సెగ తగిలితే గాని రుచి రావట్లేదు.
బండి కదలాలంటే పెట్రోలు మండాలి.
పండ్లు కోసేదైనా, యుద్ధం చేసేదైనా కత్తి పదునెక్కాలంటే వేడి తగలాలి.
ఐస్‌క్రీంను చల్లగా ఉంచే ఫ్రిజ్ మోటారుకూ వేడికావాలి.
జీవితం కూడా అంతేనేమో ...కష్టాల వేడి తగలాలి .
అన్నీ వేడి వేడి పాఠాలే.
జీవితానికి రుచి నేర్పాలంటే సెగ తగలాలి!

రామ్ - 8096339900

అనంతమైన దు:ఖాన్ని
చిన్న నవ్వు
చెరిపివేస్తుంది..



భయంకరమైన
మౌనాన్ని ఒక
మాట ప్రభావితం
చేస్తుంది..

రామ్ - 8096339900

www.ramkarri.com

ఉత్తమ అధ్యాపకుడు  అనుభవం

ఉత్తమ పుస్తకం  జీవితం

ఉత్తమ పాఠం  సహనం

ఉత్తమ ఆశ్రయం  నిజం

ఉత్తమ కాలక్షేపం  కర్తవ్యనిర్వాహణ

ఉత్తమ బంధుత్వం  సదాలోచన

సమస్య వెనుక సమాధానం ఉంది
దుఃఖం వెనుక సుఖం ఖాయం
ప్రతి కష్టం గొప్ప మార్పుకు కారణం
ఓర్పు లో వుంది విజయం

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

ఆకాశాన్ని తాకే శక్తి
భగవంతుడు నీకు
ఇవ్వకపోవచ్చు

-- కానీ..

ఆకాశమంత స్థాయికి
నువ్వు ఎదిగే అవకాశాన్ని
నీకిచ్చాడని గ్రహించు.

ఆకాశంలో ఒక గ్రద్ద ఆహారం కోసం చూస్తూండగా ఒక నక్క ఎరలతో నిండిన బండి లాగుతూ వెళ్తోందట. పైనుండి దీన్ని చూచిన గ్రద్ద రయ్యిమని ఆ నక్క ముందు వాలి, ఆ ఎరలు కావాలని నక్కను అడిగిందట, అప్పుడు ఆ నక్క ''తప్పకుండా ఇస్తాను. కాని కొంత వెల అవుతుంది'' అన్నదట. దానికి ఆ గ్రద్ద 'ఏమివ్వాలి, ఎంతివ్వాలి' అని అడిగితే, 'నీ రెండు ఈకలు ఇస్తే, నేను ఒక ఎరను ఇస్తాను' అని నక్క అన్నదట. గ్రద్ద తన రెండు ఈకలను పీకి ఇచ్చిందట. నక్క వాటిని తీసుకొని ఒక ఎరను తీసి ఇచ్చిందట. దాన్ని తింటూ 'ఆహా ఎంత రుచిగా ఉంది. మళ్లీ ఇంకొకటి తిందాం'' అని మళ్లీ నక్క దగ్గరకు వచ్చిందట. అలా రుచి మరిగి మళ్లీమళ్లీ తన ఈకలనిచ్చి ఎరలను కొంటూ వచ్చిందట. చివరకు ఆ గ్రద్ద ఈకలన్నీ అయిపోయాయి . అప్పుడు ఒక్కసారిగా నక్క పెద్దగా నవ్విందట. గ్రద్ద తేరుకొని, నిజం తెలుసుకొనే లోగా తన ఈకలన్నీ ఊడి, పైకి ఎగరలేకపోయింది. నక్క అమాంతం గ్రద్ద పైబడి చీల్చి తినేసింది. విచక్షణ కోల్పోయి శక్తినంతా అమ్ముకుని, దేవుడిచ్చిన ఎగిరే శక్తిని కోల్పోయి చివరకు ప్రాణాలు విడిచింది.

సరిగ్గా మన జీవితంలో కూడా, మనల్ని ఆకర్షించి, ప్రలోభపెట్టి మనకు తాత్కాలిక ఆనందాన్ని, ఆహ్లాదాన్ని ఇచ్చే విషయాలే మన పాలిట విషప్రాయాలై మన జీవితాలను విషాదంలో ముంచేస్తాయి. ఆకర్షణల ప్రలోభాల కారణంగా మన దృష్టి మరల్చబడుతుంది. మనిషి యొక్క లక్ష్యాన్ని, ఏకాగ్రతను, భగ్నంచేసే పరిస్థితులు, ప్రలోభాలు అడుగడుగునా ఎదురవుతూనే ఉంటాయి,
ఒక వ్యక్తి తన ముందున్న లక్ష్యాన్ని సాధించే ప్రయత్నంలో
ఆకర్షణలు, ప్రలోభాల రూపంలో ఎదురవుతుంటాయి,
ఎదుర్కొని తీరాల్సి వస్తుంది.

00966539608 - కర్రి



www.ramkarri.com

శు
భ
ది
న
ం

కోపం యమధర్మరాజ లాంటిది.
తృష్ణ వైతరణిలాంటిది.
విద్య కామధేనువులాంటిది.

ఇక సంతృప్తి దేవరాజైన
ఇంద్రుడి నందనవనం లాంటిది.

రామ్ - 8096339900

మనుషుల్లో మూడు రకాలుంటారు.
ఏదో జరుగుతుందని ఆశిస్తూ
కూర్చునేవారు.. ఏదైనా జరిగితే చూసి
ఆశ్చర్యపడేవారు.. ఏది
జరగాలనుకుంటారో అది జరిగే వరకూ
అలుపెరగకుండా.. అవిశ్రాంత పరిశ్రమ
చేసి సాధించేవారు. ఆశించిన ఫలితం
రానప్పుడు నిరుత్సాహం సహజం.
అందుకే శరీరానికి స్నానం ఎలాగో..
మనసుకు ప్రేరణ ప్రతిరోజూ అవసరం.

రామ్ - 8096339900

www.ramkarri.com




ప్రాతఃద్యూతప్రసంగేన
మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోర ప్రసంగేన
కాలో గచ్ఛతి ధీమతమ్॥




ఉదయం జూదానికి, మధ్యాహ్నం స్త్రీలకు, రాత్రిపూట దొంగతనానికి చెందిన ప్రసంగాలు చేస్తూ బుద్ధిమంతులు కాలం గడుపుతారు' అని పై శ్లోకానికి తాత్పర్యం. అలా గడిపేవారు బుద్ధిహీనులు అవుతారు గాని, బుద్ధిమంతులు ఎలా అవుతారు? అనే సందేహం కలుగవచ్చు. ముందుగా దీని అంతరార్థం తెలుసుకోవాలి.

ద్యూతప్రసంగం అంటే మహాభారతం, స్త్రీ ప్రసంగం అంటే రామాయణం, చోర ప్రసంగం అంటే భాగవతం. ఈ మూడు గ్రంథాలను నియమబద్ధంగా రోజూ చదువుతూ ఉండాలి. వింటూ ఉండాలి. అందువలన ఎన్నో లాభాలు ఉన్నాయి. జీవనవిధానంపై ఒక అవగాహన ఏర్పడుతుంది. వ్యవహారశైలికి ఆధారం దొరుకుతుంది.

మహాభారతం ఉదయాన్నే చదివితే ఆ రోజంతా ఎవరితో ఎట్లా మెలగాలో, ఏ పని ఎలా చేయాలో, వ్యక్తిత్వవికాసం జరుగుతుంది. రామాయణం మధ్యాహ్నం జ్ఞప్తి చేసుకోవటం వలన, కుటుంబ వ్యవహారాలు, బంధుమిత్రుల మధ్య మానవసంబంధాల పట్ల స్ఫూర్తి కలుగుతుంది. నిత్యకృత్యాలను ముగించుకొని నిద్రపోయే ముందు భాగవత శ్రవణపఠనాల వల్ల మానవజన్మ సార్థకత, భక్తిభావ పరిపుష్టితో మానసికమైన ఒత్తిడులు తొలగి, దైవచింతనతో హాయిగా నిద్రపడుతుంది.

రామ్ - 8096339900




www.ramkarri.com

గెలవాలంటే ఉండాల్సింది ఆశ కాదు
ఆశయం..

రామ్ - 8096339900

www.ramkarri.com

బాధ్యతకూ ప్రేమకూ తేడా ఉంది. పొద్దున్నే కాఫీ కలిపివ్వడం బాధ్యతా? ప్రేమా? జీతం రాగానే భార్య చేతిలో పెట్టడం బాధ్యతా? ప్రేమా? పొరపాటుగా రోడ్డు మీదకు వచ్చిన మూడేళ్ళ కూతురు ఇంకో క్షణమైతే కారు కింద పడేదని తెలిసినప్పుడు, తల్లి ఆ పిల్లను అక్కున చేర్చుకోనేది పోయి దెబ్బలు వేస్తుంది. ప్రేమతో శిక్ష విధించినట్టా? కూతురి సంరక్షణ బాధ్యతను నిర్వహించినట్టా? మనం ప్రేమకన్నా బాధ్యతే ఎక్కువగా వ్యక్తం చేస్తుంటాం. కాని దాన్ని ప్రేమగా పొరపడుతుంటాం. బాధ్యతగా ఉండటమంటే, ప్రేమించకుండా ఉండటం కాదు. ప్రేమగా ఉండటమంటే, బాధ్యతను విస్మరించడమూ కాదు. ఎంతో ప్రేమను వ్యక్తం చేయగల శక్తి మనలో ఉంది. కానీ మన ఇంట్లో మన వాళ్ళను మాత్రం విసుక్కుంటాం. చిన్న విషయానికి చిరాకుపడతాం. చిన్న బుచ్చుతాం. పక్కింటి పిల్లాడితో మాట్లాడినంత ఆప్యాయతగా మన పిల్లలతో ఎందుకు మాట్లాడం? దీనికంతటికి కారణం మనం మన వారిని ' మన వారే కాదా' అని అశ్రద్ధ చేయడం.... అశ్రద్ధ ప్రేమ వ్యక్తం చేయడంలో మాత్రమే జరుగుతుంది. నిజానికి మనం ఎక్కువ ప్రేమించేది మన పిల్లలనే. అయినా దాన్ని తరచు ప్రకటించం. ప్రేమ కడుపులో ఉంటే చాలదు. దాన్ని కళ్ళల్లో చూపించాలి, మాటల్లో చెప్పాలి, చేతల్లో ప్రదర్శించాలి. అడగనిదే అమ్మయినా అన్నం పెట్టదంటారు. చెప్పనిదే కొడుకుకైనా మనం ఎంత ప్రేమిస్తున్నామో తెలియదు. ప్రేమను పంచడమే కాదు, ప్రేమని చెప్పండి, మాటల నెయ్యి జల్లి, ప్రేమ భోజనం వడ్డించండి.




రామ్ - 8096339900

ఒకరోజు ఒక అతను కొద్దిగా పిగిలిన గూడులోంచి బయటకు రావడానికి తన్నుకులాడుతున్న సీతాకోకచిలుకని చూశాడు. గూడు కర్పరం గట్టిగా ఉంది. సామాన్యంగా అవి బయటకు రావడానికి రెండు రోజులలా కొట్టుకుంటూనే ఉంటాయి. అయినా రాలేకపోతే లోపలే చనిపోతాయి. అందువల్ల ఆ యోగికి జాలి కలిగింది. తన గోటితో ఆ గూడును కొద్దిగా తెరిచి, అది రాగలిగేట్టు చేశాడు. తీరా అది బయటకు వచ్చాక ఎగరలేకపోయింది. బయటపడేందుకు పడాల్సిన శ్రమలోంచే దాని రెక్కలకు ఎగిరే సామర్థ్యం లభిస్తుంది. ఎగరలేని సీతాకోకచిలుక వల్ల ప్రయోజనమేముంది? చాలామంది తల్లిదండ్రులు ప్రేమ పేరుతో పిల్లల్ని ఎగరలేని సీతాకోకచిలుకల్ని చేస్తున్నారు. పిల్లలను బట్టి ఎంత ప్రేమ, ఎంత శ్రద్ధ, ఎంత కాఠిన్యం అవసరమో తెల్సుకోవాలి. కావలసింది కొంత విచక్షణ. కొబ్బరితోటలో ఉండగా, 'ఒక్కో చెట్టుకూ ఎన్ని నీళ్ళు పోయాలి' అని అడిగితే, 'కనీసం 50 లీటర్లన్నా కావాలి' అంటారు. ఇంటికెళ్లి అన్ని నీళ్లు గులాబీ మొక్కకు పోస్తే అది చచ్చిపోతుంది. అందుకే ఇంట్లో ఉన్న మొక్క ఎటువంటిదో చూసుకోవాలి.






నిన్న అన్నది గతం
రేపు అన్నది సంశయం
నేడు అన్నది నిజం
అలాంటి ఈ రోజు మీరు
ఆనందంగా గడపాలని
మనస్ఫూర్తిగా కోరుకుంటూ..
మీకు శుభోదయం

రామ్ - 8096339900

ప్రతి రోజూ ప్రత్యేకమైనదే..! ప్రతి రోజూ ప్రత్యేకమైనదే..!

www.ramkarri.com

తన చుట్టూ ముళ్ళున్నా
విరియుట మానునా విరులు

తన చుట్టూ బురద ఉన్నా
వికసించదా కమలము

వట వృక్షపు నీడనున్నా
మొలకెత్తదా విత్తనము

www.ramkarri.com

జీవితానికి ఒక ఆశయం ఉంటే
ప్రతికూల పరిస్థితులు
ప్రతిబంధకాలు కాలేవు ఏనాడూ.....

రామ్ - 8096339900

www.ramkarri.com

సముద్రంలో ప్రయాణిస్తున్న ఓ నావ అకస్మాత్తుగా ప్రమాదానికి గురయింది. అందులో కేవలం ఒక్క వ్యక్తి మాత్రం అదృష్టవశాత్తూ బతికి బయటపడి ఒక కొయ్య దుంగమీద తేలుతూ జనసంచారం లేని ఒక దీవిలోకి వచ్చి పడ్డాడు. ఆ ప్రమాదం నుంచి రక్షించమని రోజూ భగవంతుని వేడుకుంటూ ఉన్నాడు. ఎవరైనా తనను రక్షించడానికి వస్తారేమోనని సముద్రం వైపు ఆశగా ఎదురు చూసేవాడు. చూసిచూసి విసిగి పోయాడు. ప్రకృతి శక్తుల నుండి రక్షణ కోసం తేలుతూ వచ్చిన చెక్కలతో ఒక చిన్న గుడిసె నిర్మించుకున్నాడు. ఆ గుడిసెలో అలల తాకిడికి కొట్టుకు వచ్చిన కొన్ని పనికొచ్చే వస్తువులు దాచుకున్నాడు. ఒక రోజు ఆహారం కోసం వెళ్ళి తిరిగి గుడిసె దగ్గరకు వచ్చే సరికి అది తగలబడిపోయి పొగలుపైకి లేస్తున్నాయి. తనకున్న ఒక్క ఆధారం కూడా అగ్నికి ఆహుతైపోయిందని బాధతో కుంగిపోయాడు, దు:ఖిస్తూ అలాగే నిద్రపోయాడు. తెల్లవారి లేచి చూసేసరికి ఒక నావ అతనుండే దీవిని సమీపిస్తూ కనిపించింది. అది అతన్ని రక్షించడానికే వచ్చిందని తెలిసిన అతని ఆనందానికి అవధుల్లేవు. ఆ నావలోని వాళ్ళని ''నేను ఇక్కడున్నానని మీకెలా తెలిసింది?'' అని అడిగాడు. ''నువ్వు పొగ ద్వారా మాకు సంజ్ఞలు చేశావు కదా, దానిని గుర్తు పట్టే ఇక్కడికి రాగలిగాం'' అన్నాడు.

ఒక్కోసారి మన ఆశల సౌధాలు ఇలాగే తగలబడి పోవచ్చు.
కానీ అదే మంటలు ఏ భగవంతుని రాకకో సంకేతం కావచ్చు.

రామ్ - 8096339900

శత్రువుతో యుద్ధం - మనం శాంతికోసం
చెల్లించే మూల్యం.
సమస్యతో యుద్ధం - మనశ్శాంతి కోసం
చెల్లించాల్సిన మూల్యం.

రామ్ - 8096339900

www.ramkarri.com





ప్రేమంటే అవతలివారిని అర్థం చేసుకోవటం ఒకటే కాదు. అవతలి వారి చేత అర్థం చేసుకోబడటం కూడా!

ప్రేమంటే చిరునవ్వు. ప్రేమంటే ఆనందం. ప్రేమంటే దయ, ప్రేమంటే కరుణ. ప్రేమంటే తీసుకోవడం కాదు, ఇవ్వడం.

పదమూడేళ్ల కుర్రవాడికి వాళ్ల అన్నయ్య అమెరికా నుంచి కొత్త సైకిల్ పుట్టిన రోజు బహుమతిగా పంపించాడు. పక్కింటి ఎనిమిదేళ్ళ కుర్రవాడిని ఎక్కించుకొని తొక్కుతున్నాడు.

అద్భుతంగా ఉన్నది సైకిల్.
చిన్నవాడు థ్రిల్ అయ్యాడు. "ఎక్కడిదీ సైకిల్" ?
"మా అన్నయ్య అమెరికా నుంచి పంపాడు"?
"ఎంత బావుండేది నాక్కూడా.." ఆగాడు చిన్న కుర్రాడు.
ఏమిటి? నీక్కూడా?
"ఓ అన్నయ్య అమెరికాలో ఉండి ఇలా సైకిల్ పంపిస్తేనా?
"కాదు. నాక్కూడా తొందరగా వయసొచ్చి, అమెరికా వెళ్ళి మా తమ్ముడికి ఓ సైకిల్ పంపిస్తే" అన్నాడు అతడు. అదీ ప్రేమంటే.





మేలుకొనేటప్పుడు మనతో పాటు ఉండవలసినది

# లక్ష్యం



# తృప్తి

పడుకొనేటప్పుడు మనతో పాటు ఉండవలసినది

అన్నివైపుల నుంచి సెగ.... నలువైపుల నుంచీ విసిగించే వేడి.
చిన్నప్పుడు చదువు కోసం అమ్మా నాన్నా పోరు ...
పెళ్లయ్యాక సంసారంలో బాధ్యతల పోరు ...
ఆఫీస్‌లో నిత్యం పని పోరు............ ఇలా అన్ని చోట్లా సెగ .
జీవితం కూడా ఓ మంటగానే అనిపిస్తోంది.
ఎర్రటి నిప్పుల మీద చిటపటమంటున్న మొక్క జొన్న పొత్తులు,
మంటలపై కాలుతున్న పెనంపైన ఇసుకలో వేగుతున్న వేరుశెనక్కాయలు.
వాటికి నిప్పుల సెగ తగిలితే గాని రుచి రావట్లేదు.
బండి కదలాలంటే పెట్రోలు మండాలి.
పండ్లు కోసేదైనా, యుద్ధం చేసేదైనా కత్తి పదునెక్కాలంటే వేడి తగలాలి.
ఐస్‌క్రీంను చల్లగా ఉంచే ఫ్రిజ్ మోటారుకూ వేడికావాలి.
జీవితం కూడా అంతేనేమో ...కష్టాల వేడి తగలాలి .
అన్నీ వేడి వేడి పారాలే.
జీవితానికి రుచి నేర్పాలంటే సెగ తగలాలి!

రామ్ - 8096339900

www.ramkarri.com

ఎన్ని యుగాలు మారినా... ఎన్ని తరాలు దాటినా...
మారని మాధుర్యం అమ్మ ప్రేమ

ఏ దేశమేగిన... ఏ తీరం దాటినా...
మరువని మమకారం అమ్మ ప్రేమ.

ప్రకృతి చేసిన బంగారు ప్రతిమా..
ప్రతి గుండె చేసే సడిలోని భావమా...

పాదాభివందనం నీ కమ్మా...
ఈ పాదాల వందనం నీ కోసం అమ్మ.

రామ్ - 8096339900



తితి

కలకానిది విలువైనది

బ్రతుకు కన్నీటి ధారల్లోన బలిచేయకు

అగాధమనే జలనిధిలోన

ఆణిముత్యమున్నటులే

శోకాల మరుగున దాగి

సుఖమున్నదిలే

ఏదీ తనంతతానై నీదరికి రాదోయ్

శోధించి సాధించాలి అదె ధీర గుణం



www.ramkarri.com

ఉత్తమ అధ్యాపకుడు  అనుభవం

ఉత్తమ పుస్తకం  జీవితం

ఉత్తమ పాఠం  సహనం

ఉత్తమ ఆశ్రయం  నిజం

ఉత్తమ కాలక్షేపం  కర్తవ్యనిర్వాహణ

ఉత్తమ బంధుత్వం  సదాలోచన

రామ్ - 8096339900

సమస్య వెనుక సమాధానం ఉంది
దుఃఖం వెనుక సుఖం ఖాయం
ప్రతి కష్టం గొప్ప మార్పుకు కారణం
ఓర్పు లో వుంది విజయం

రామ్ - 8096339900

www.ramkarri.com

ఆకాశాన్ని తాకే శక్తి
భగవంతుడు నీకు
ఇవ్వకపోవచ్చు

-- కానీ..

ఆకాశమంత స్థాయికి
నువ్వు ఎదిగే అవకాశాన్ని
నీకిచ్చాడని గ్రహించు.

ఆకాశంలో ఒక గ్రద్ద ఆహారం కోసం చూస్తూండగా ఒక నక్క ఎరలతో నిండిన బండి లాగుతూ వెళ్తోందట. పైనుండి దీన్ని చూచిన గ్రద్ద రయ్యిమని ఆ నక్క ముందు వాలి, ఆ ఎరలు కావాలని నక్కను అడిగిందట, అప్పుడు ఆ నక్క ''తప్పకుండా ఇస్తాను. కాని కొంత వెల అవుతుంది'' అన్నదట. దానికి ఆ గ్రద్ద 'ఏమివ్వాలి, ఎంతివ్వాలి' అని అడిగితే, 'నీ రెండు ఈకలు ఇస్తే, నేను ఒక ఎరను ఇస్తాను' అని నక్క అన్నదట. గ్రద్ద తన రెండు ఈకలను పీకి ఇచ్చిందట. నక్క వాటిని తీసుకొని ఒక ఎరను తీసి ఇచ్చిందట. దాన్ని తింటూ 'ఆహా ఎంత రుచిగా ఉంది. మళ్లీ ఇంకొకటి తిందాం'' అని మళ్లీ నక్క దగ్గరకు వచ్చిందట. అలా రుచి మరిగి మళ్లీమళ్లీ తన ఈకలనిచ్చి ఎరలను కొంటూ వచ్చిందట. చివరకు ఆ గ్రద్ద ఈకలన్నీ అయిపోయాయి . అప్పుడు ఒక్కసారిగా నక్క పెద్దగా నవ్విందట. గ్రద్ద తేరుకొని, నిజం తెలుసుకొనే లోగా తన ఈకలన్నీ ఊడి, పైకి ఎగరలేకపోయింది. నక్క అమాంతం గ్రద్ద పైబడి చీల్చి తినేసింది. విచక్షణ కోల్పోయి శక్తినంతా అమ్ముకుని, దేవుడిచ్చిన ఎగిరే శక్తిని కోల్పోయి చివరకు ప్రాణాలు విడిచింది.

సరిగ్గా మన జీవితంలో కూడా, మనల్ని ఆకర్షించి, ప్రలోభపెట్టి మనకు తాత్కాలిక ఆనందాన్ని, ఆహ్లాదాన్ని ఇచ్చే విషయాలే మన పాలిట విషప్రాయాలై మన జీవితాలను విషాదంలో ముంచేస్తాయి. ఆకర్షణల ప్రలోభాల కారణంగా మన దృష్టి మరల్చబడుతుంది. మనిషి యొక్క లక్ష్యాన్ని, ఏకాగ్రతను, భగ్నంచేసే పరిస్థితులు, ప్రలోభాలు అడుగడుగునా ఎదురవుతూనే ఉంటాయి,
ఒక వ్యక్తి తన ముందున్న లక్ష్యాన్ని సాధించే ప్రయత్నంలో
ఆకర్షణలు, ప్రలోభాల రూపంలో ఎదురవుతుంటాయి,
ఎదుర్కొని తీరాల్సి వస్తుంది. రామ్ - 8096339900 www.ramkarri.com

గాలి బలం తెలీదు, సుడిగాలై నిన్ను చుట్టేంతవరకు

నీటి బలం తెలీదు, ఉప్పెనై పోటెత్తేంతవరకు

విత్తు బలం తెలీదు,

మొక్కగా మొలకెత్తేంతవరకు

నీ బలం నీకు తెలీదు, నిన్ను నువ్వు నమ్మేంతవరకు

రామ్ - 8096339900

పరిస్థితులను తనకి
అనుకూలంగా
మలుచుకోగల వాళ్ళు......
ఎంతో అదృష్టవంతులు.



శు
భో
ద
యం

www.ramkarri.com

కోపం యమధర్మరాజు లాంటిది.
తృష్ణ వైతరణిలాంటిది.
విద్య కామధేనువులాంటిది.

ఇక సంతృప్తి దేవరాజైన
ఇంద్రుడి నందనవనం లాంటిది.

రామ్ - 8096339900

మనుషుల్లో మూడు రకాలుంటారు.
ఏదో జరుగుతుందని ఆశిస్తూ
కూర్చునేవారు.. ఏదైనా జరిగితే చూసి
ఆశ్చర్యపడేవారు.. ఏది
జరగాలనుకుంటారో అది జరిగే వరకూ
అలుపెరగకుండా.. అవిశ్రాంత పరిశ్రమ
చేసి సాధించేవారు. ఆశించిన ఫలితం
రానప్పుడు నిరుత్సాహం సహజం.
అందుకే శరీరానికి స్నానం ఎలాగో..
మనసుకు ప్రేరణ ప్రతిరోజూ అవసరం.

రామ్ - 8096339900

www.ramkarri.com




ప్రాతఃద్యూతప్రసంగేన
మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోర ప్రసంగేన
కాలో గచ్ఛతి ధీమతమ్॥




ఉదయం జూదానికి, మధ్యాహ్నం స్త్రీలకు, రాత్రిపూట దొంగతనానికి చెందిన ప్రసంగాలు చేస్తూ బుద్ధిమంతులు కాలం గడుపుతారు' అని పై శ్లోకానికి తాత్పర్యం. అలా గడిపేవారు బుద్ధిహీనులు అవుతారు గాని, బుద్ధిమంతులు ఎలా అవుతారు? అనే సందేహం కలుగవచ్చు. ముందుగా దీని అంతరార్థం తెలుసుకోవాలి.

ద్యూతప్రసంగం అంటే మహాభారతం, స్త్రీ ప్రసంగం అంటే రామాయణం, చోర ప్రసంగం అంటే భాగవతం. ఈ మూడు గ్రంథాలను నియమబద్ధంగా రోజూ చదువుతూ ఉండాలి. వింటూ ఉండాలి. అందువలన ఎన్నో లాభాలు ఉన్నాయి. జీవనవిధానంపై ఒక అవగాహన ఏర్పడుతుంది. వ్యవహారశైలికి ఆధారం దొరుకుతుంది.

మహాభారతం ఉదయాన్నే చదివితే ఆ రోజంతా ఎవరితో ఎట్లా మెలగాలో, ఏ పని ఎలా చేయాలో, వ్యక్తిత్వవికాసం జరుగుతుంది. రామాయణం మధ్యాహ్నం జ్ఞప్తి చేసుకోవటం వలన, కుటుంబ వ్యవహారాలు, బంధుమిత్రుల మధ్య మానవసంబంధాల పట్ల స్ఫూర్తి కలుగుతుంది. నిత్యకృత్యాలను ముగించుకొని నిద్రపోయే ముందు భాగవత శ్రవణపఠనాల వల్ల మానవజన్మ సార్థకత, భక్తిభావ పరిపుష్టితో మానసికమైన ఒత్తిడులు తొలగి, దైవచింతనతో హాయిగా నిద్రపడుతుంది.





అనంతమైన దు:ఖాన్ని
చిన్న నవ్వు
చెరిపివేస్తుంది..

భయంకరమైన
మౌనాన్ని ఒక
మాట ప్రభావితం
చేస్తుంది..

రామ్ - 8096339900



www.ramkarri.com

ఒక గమ్యమంటూ లేనివారికి
ఏ లాంతరూ దారి చూపలేదు

www.ramkarri.com

రామ్ - 8096339900

గెలవాలంటే ఉండాల్సింది ఆశ కాదు
ఆశయం..

రామ్ - 8096339900

బాధ్యతకూ ప్రేమకూ తేడా ఉంది. పొద్దున్నే కాఫీ కలిపివ్వడం బాధ్యతా? ప్రేమా? జీతం రాగానే భార్య చేతిలో పెట్టడం బాధ్యతా? ప్రేమా? పొరపాటుగా రోడ్డు మీదకు వచ్చిన మూడేళ్ళ కూతురు ఇంకో క్షణమైతే కారు కింద పడేదని తెలిసినప్పుడు, తల్లి ఆ పిల్లను అక్కున చేర్చుకోనేది పోయి దెబ్బలు వేస్తుంది. ప్రేమతో శిక్ష విధించినట్టా? కూతురి సంరక్షణ బాధ్యతను నిర్వహించినట్టా? మనం ప్రేమకన్నా బాధ్యతే ఎక్కువగా వ్యక్తం చేస్తుంటాం. కాని దాన్ని ప్రేమగా పొరపడుతుంటాం. బాధ్యతగా ఉండటమంటే, ప్రేమించకుండా ఉండటం కాదు. ప్రేమగా ఉండటమంటే, బాధ్యతను విస్మరించడమూ కాదు. ఎంతో ప్రేమను వ్యక్తం చేయగల శక్తి మనలో ఉంది. కానీ మన ఇంట్లో మన వాళ్ళను మాత్రం విసుక్కుంటాం. చిన్న విషయానికి చిరాకుపడతాం. చిన్నబుచ్చుతాం. పక్కింటి పిల్లాడితో మాట్లాడినంత ఆప్యాయతగా మన పిల్లలతో ఎందుకు మాట్లాడం? దీనికంతటికి కారణం మనం మన వారిని ' మన వారే కాదా' అని అశ్రద్ధ చేయడం.... అశ్రద్ధ ప్రేమ వ్యక్తం చేయడంలో మాత్రమే జరుగుతుంది. నిజానికి మనం ఎక్కువ ప్రేమించేది మన పిల్లలనే. అయినా దాన్ని తరచు ప్రకటించం. ప్రేమ కడుపులో ఉంటే చాలదు. దాన్ని కళ్ళల్లో చూపించాలి, మాటల్లో చెప్పాలి, చేతల్లో ప్రదర్శించాలి. అడగనిదే అమ్మయినా అన్నం పెట్టదంటారు. చెప్పనిదే కొడుకుకైనా మనం ఎంత ప్రేమిస్తున్నామో తెలియదు. ప్రేమను పంచడమే కాదు, ప్రేమని చెప్పండి, మాటల నెయ్యి జల్లి, ప్రేమ భోజనం వడ్డించండి.




రామ్ - 8096339900







బ్రహ్మ కడిగిన పాదము... బ్రహ్మము తానె నీ పాదము...
పరమ యోగులకు పరిపరి విధముల వరమొసగెడి నీ పాదము...
తిరువేంకటగిరి తిరమని చూపిన పరమ పదము నీ పాదము...
బ్రహ్మ కడిగిన పాదము... బ్రహ్మము తానె నీ పాదము...

రామ్ - 8096339900

www.ramkarri.com

ఒకరోజు ఒక అతను కొద్దిగా పిగిలిన గూడులోంచి బయటకు రావడానికి తన్నుకులాడుతున్న సీతాకోకచిలుకని చూశాడు. గూడు కర్పరం గట్టిగా ఉంది. సామాన్యంగా అవి బయటకు రావడానికి రెండు రోజులలా కొట్టుకుంటూనే ఉంటాయి. అయినా రాలేకపోతే లోపలే చనిపోతాయి. అందువల్ల ఆ యోగికి జాలి కలిగింది. తన గోటితో ఆ గూడును కొద్దిగా తెరిచి, అది రాగలిగేట్టు చేశాడు. తీరా అది బయటకు వచ్చాక ఎగరలేకపోయింది. బయటపడేందుకు పడాల్సిన శ్రమలోంచే దాని రెక్కలకు ఎగిరే సామర్థ్యం లభిస్తుంది. ఎగరలేని సీతాకోకచిలుక వల్ల ప్రయోజనమేముంది? చాలామంది తల్లిదండ్రులు ప్రేమ పేరుతో పిల్లల్ని ఎగరలేని సీతాకోకచిలుకల్ని చేస్తున్నారు. పిల్లలను బట్టి ఎంత ప్రేమ, ఎంత శ్రద్ధ, ఎంత కాఠిన్యం అవసరమో తెల్సుకోవాలి. కావలసింది కొంత విచక్షణ. కొబ్బరితోటలో ఉండగా, 'ఒక్కో చెట్టుకూ ఎన్ని నీళ్లు పోయాలి' అని అడిగితే, 'కనీసం 50 లీటర్లన్నా కావాలి' అంటారు. ఇంటికెళ్లి అన్ని నీళ్లు గులాబీ మొక్కకు పోస్తే అది చచ్చిపోతుంది. అందుకే ఇంట్లో ఉన్న మొక్క ఎటువంటిదో చూసుకోవాలి.








రామ్ - 8096339900

ఆ ఏడుకొండలవాని దయతో
అందరూ సుఖసంతోషాలతో
వర్ధిల్లాలని ఆశిస్తూ
అందరికీ

# శుభోదయం

www.ramkarri.com

కోపానికి బద్ధ శత్రువు ఓర్పు. ఓర్పు కి ప్రతీక
సాలెపురుగు. గదిలో ఒక మూల.....
ఎవరిని సహాయం అడగకుండా..
ఎవరినీ బాదించకుండా ...
నిశ్శబ్దంగా ఓర్పుగా, ఒంటరిగా
అది గూడు కట్టుకుంటుంది.
ఒక హడావుడి ఉదయమో.. నిశబ్దపు
సాయంత్రమో... చీపురుకట్ట దాని
శ్రమంతా తుడిచి పెట్టేస్తుంది...
సాలెపురుగు అనాథలా నేల మీద
పడుతుంది. ఎవర్నీ కుట్టదు...
ఎవరి మీదా.... కోపం ప్రదర్శించదు.
మళ్ళీ, తన మనుగడ కోసం,
కొత్త వంతెన నిర్మించుకోవడానికి,
సహనమనే పోగుల్ని.... నమ్మకం గోడల
మీద తిరిగి ప్రవిస్తుంది. ఎలా బ్రతకాలో...
మనిషి కి పాఠం చెబుతుంది.

కారుచీకట్లను  తరిమికొట్టి
జ్ఞాన ప్రకాశాలతో
జీవితంలో వెలుగు నింపుతావు

మనుషుల పాపాలు తొలగించి
మంచినీరుతో
జ్ఞాన దీపాలు వెలిగించావు

వేదనతో వద్దకు
వచ్చిన వారికి వ్యథలు తీర్చి
తప్పక సహాయం  చేస్తావు

మంచి చెడులను విభజించి
ప్రతి ఒక్కరికి
ముక్తి మార్గం బోధిస్తావు

కుల మాతాలు ,
జంతు జీవులని చూడకుండా

అందరికి  సమానంగా
ప్రేమను పంచుతావు

అప్తరక్షకుడై
అనుక్షణం మము కాపాడే



రామ్ - 8096339900

సర్వేశ్వర శరణు శరణూ

శుభ సాయంత్రం

మిత్రమా!

రామ్ - 8096339900

www.ramkarri.com

తృప్తి అమూల్యమైన ముత్యం.
ఈ ముత్యాన్ని పొందినవాడు
వివేకాన్ని, ఆనందాన్ని పొందుతాడు.

జీవితాన్ని నీటి ప్రవాహంలాగా
నిత్య చైతన్యంగా మలుచుకుంటే
అంతా ఆహ్లాదమే ఆనందభరితమే

రామ్ - 8096339900

www.ramkarri.com


www.ramkarri.com
విజయం పొందాలంటే
అంతులేని పట్టుదలను, ప్రబలమైన సంకల్ప శక్తిని కలిగి ఉండాలి.
సంకల్పంతో కష్టపడి పనిచేస్తే తప్పక గమ్యాన్ని చేరతాము.
రామ్ - 8096339900

ఏదైనా వస్తువు వెనక ఉన్న భావనని గుర్తించినపుడు, అది కానుకగా మారుతుంది. కానీ వస్తువు వెనక భావనని మీరు చూడనట్టయితే, అది కానుకే అయినప్పటికీ, ఒక వస్తువుగానే మిగిలిపోతుంది.



కానుక అనేది ఒక వస్తువు కాదు,
ఒక దృష్టి –
ఆ వస్తువు వెనకగల
హృదయాన్ని చూసే దృష్టి.

**శుభోదయం**

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

ప్రతి రాయిలోను ఒక శిల్పం దాగుకొని ఉంటుంది.
సుత్తితో బద్దలు కొడితే శిల్పం రాదు..
ఉలి తో చెక్కాలి. అప్పుడే ఆ రాయిలోనుంచి
అపురూపమైన శిల్పం బయటపడుతుంది..
అలాగే ప్రతి మనిషి జీవితం లో అతీతమైన శక్తి
దాగుంటుంది. దాన్ని ఎప్పుడైతే గుర్తిస్తామో
మనముండే ఏమిటో నిరూపించుకోవచ్చు.

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

ఉల్లాసంగా ఉండే మెదడు ఒక విషయంపై
స్థిరమైన అభిప్రాయానికి రావడానికి
సాయపడుతుంది.

తెలివి తేటలున్నప్పటికీ కొన్ని బంధనాల మధ్య
కట్టడి చేసుకొన్న మెదడు వేయి రకాల
ఇబ్బందులను సృష్టిస్తుంది.





www.ramkarri.com

ఆకులనే ఆశలను శిశిరం లాంటి వ్యక్తులు నిర్దాక్షిణ్యంగా
రాల్చేసినా ... తొలకరిలో వసంతం లాంటి ఆత్మీయుల
ఓదార్పుతో కొత్త చిగురులు తొడుగుతాయి

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

ఏ బాంధవ్యమైనా
గౌరవం మీద
ఆధారపడి ఉంటుంది

రామ్ - 8096339900

www.ramkarri.com

శుభోదయం




గుడ్ మార్నింగ్

‘బాధపడేవాడికి బ్రహ్మాండమెంతో ఇరుకు’

ఎప్పుడూ బాధపడేవాడికి ఈ విశాలమైన ప్రపంచం కూడా చాలా ఇరుకు ఇరుకుగా కనిపిస్తుందట.

మరి సంతోషమే జీవితమైనవాడికి?

‘ఈ ప్రపంచం ఒక విశాలమైన స్వర్గం’

ఏదీ కావాలని జరగదు....

మనం కావాలని తీసుకునే
నిర్ణయాలవల్లే ఏదైనా
జరుగుతుంది.



రామ్ - 8096339900



www.ramkarri.com

మనిషికి కలిగే ఆలోచనలే..
వారు ఏలా మార్పు చెందాలన్నదానికి
కారకాలుగా నిలుస్తాయి...
ఆలోచనలే తీర్చి దిద్దుతాయి...

# శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

మనం ఇతరులని అనుకరించవద్దు.
మనం మన నిజస్వరూపాన్ని తెలుసుకుందాం.
మనం మనలాగే ఉందాం. ఎందుకంటే,
'ఈర్ష్య, అజ్ఞానం, అనుకరణ' ఆత్మహత్య కనుక.
మీరెవరో తెలుసుకోండి. మీలాగే మీరుండండి.



మీలా ఈ భూప్రపంచంలో ఇంకెవ్వరూ
లేరని గుర్తుంచుకోండి.

రామ్ - 8096339900



www.ramkarri.com

ఆవేశం అగ్నిపర్వతమైతే, ఆలోచన
మంచుశిఖరం. ఒకటి పెల్లుబకటానికి
ఉర్రూతలాడితే మరొకటి ముందడుగును
కూడ ఘనీభవింప చేస్తుంది.
రెండిటికీ మధ్య సమన్వయం
సాధించగలిగితే జీవితం గ్రీష్మంలో
శీతల పవనంలా సాగిపోగలదు.

రామ్ - 8096339900

www.ramkarri.com

జీవితం అంటే
వెతుకులాట కాదు
సృజనాత్మకత.



www.ramkarri.com

ఈ చిత్రంలోని ప్రతి కలర్ పెన్సిల్,
మనకి రోజూ ఎదురయ్యే రకరకాల మనుషులు.
ఒక్కొక్కరిది ఒక్కో రంగు.
కానీ వాళ్ళే మన జీవితాన్ని
రంగులమయం చేసేది.

రామ్ - 8096339900

దేనినైన మన బలంతో సాధించాలి
కానీ అవతలివారి బలహీనతతో కాదు.






ఎందుకంటే నిజమైన గెలుపు
మన కృషి వల్లే లభిస్తుంది తప్ప,
అవతలి వారు ఓడిపోవడం వల్ల కాదు.

రామ్ - 8096339900

ఎదుగుదలను నిరోధించే
ప్రతికూల పరిస్థితుల
మధ్యలోనూ వికసించి,
వృద్ధిపొందడమే జీవితం

శుభోదయం

రామ్ - 8096339900


శు
భో
ద
యం
జీవితం మహాసముద్రం లాంటిది,
అలలు లాగా సుఖ దుఃఖాలు
ఎగసెగసి పడుతుంటాయి.
అలలు ఎన్నడు తీరాన్ని చేరి
ఉండవు,
అలాగే నిజ జీవితంలో
దుఃఖాలు నిలిచిపోవు,
కాబట్టి ధైర్యం అనే తెరచాప
సహాయంతో సుఖ దుఃఖాలనే
ఈ సముద్రాన్ని దాటి జీవితం
అనే ఓడను గమ్యం చేర్చుకో,
www.ramkarri.com
రామ్ - 8096339900
మిత్రమా!!!

మల్లెతోట పక్కనుండి వెళ్లే వారెవరైనా ఆ పూల
గుబాళింపు నుండి తప్పించుకోలేరు.
ఆస్వాదించే రస హృదయం ఉన్నా, లేకున్నా
ఆ పరిమళం మనల్ని వదిలి పెట్టదు.
సత్పురుషుల ఉనికి కూడా అలాగే ఉంటుంది.
కేవలం తమ ఉనికి చేతనే మనకు తెలియకుండానే
మనసులో శాంతి పరిమళాలను వెదజల్లుతారు.

రామ్ - 8096339900

అన్యాయంగా చేసే విమర్శ చాలామటుకు
మారువేషంలో ఉండే ప్రశంసే.
మీరు ఎదుటివారిలో 'ఈర్ష్యనీ, అసూయనీ
రేకెత్తించారనటానికి అది నిదర్శనం.
మీకు చాతయినంత చక్కగా
పనిచెయ్యండి. ఆ తరవాత
పాత గొడుగుని తెరిచి
విమర్శల వర్షం మీ ఒంటిని
తడవకుండా చూసుకోండి.
నిష్పక్షపాతమైన నిర్మాణాత్మకమైన విమర్శని
ఆహ్వానించి, దానివల్ల సాయాన్ని పొందుదాం.

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com




ఒక ఇంజనీర్ కావాలంటే ఎన్నో పుస్తకాలు చదవాలి..
ఒక డాక్టర్ కావాలంటే ఎన్నో పుస్తకాలు చదవాలి..
ఒక లాయర్ కావాలంటే ఇంకెన్నో పుస్తకాలు చదవాలి..
అదే ఒక గొప్ప వ్యక్తివి కావాలంటే ఒక "భగవద్గీత "" చదివితే చాలు..
భగవద్గీత ఒక మనిషిని ఉన్న వ్యక్తి నుంచి ఉన్నత వ్యక్తిగా మారుస్తుంది.
అది భగవద్గీత గొప్పతనం..

రామ్ - 8096339900

# జీవితంలోని సగం బాధలు

YES

NO

'సరే' అని
త్వరగాను..

' వద్దు' అని
అలస్యంగాను..

చెప్పటం వల్లనే
కలుగుతాయి.

రామ్ - 8096339900

# శుభోదయం



జీవితం చిన్నది. కళ పెద్దది.
అవకాశం వేగవంతమైనది.
అనుభవం నమ్మదగినది.
నిర్ణయం కష్టమైనది.




www.ramkarri.com

ఊరి బాట వెంబడి ఇంటింటికి బిచ్చమెత్తుతు బయలుదేరాను.
దూరంగా నీ బంగారు రథం మిరుమిట్లు గొలిపే స్వప్నంవలె కనిపించింది.
నేను ఆశ్చర్యపోయాను. నాలో ఆశలు చిగురించాయి. నా దరిద్రం
తీరిపోయిందనుకున్నాను. నేనున్న చోటనే నీ రథం ఆగింది.
నీ చూపు  నా పైన వాలింది. చిరునవ్వుతో రథం దిగివచ్చావు.
నన్ను సమీపించి హఠాత్తుగా  నీ కుడిచేయి చాచి
' నాకేం ఇస్తావు?' అని అడిగావు.
యాచకుడి నుంచి యాచించడానికి చెయ్యి చాచే నా ప్రభూ
పరిహాసాన్ని ఏమనను!
ఏమి తోచక నా జోలి నుంచి ఒక చిన్న ధాన్యపుగింజను తీసి
నీ చేతిలో ఉంచాను.
రాత్రి ఇంటికి పోయి నా సంచీని దులిపినపుడు ఆగింజల మధ్య
ఒక చిన్న బంగారపు గింజ కనిపించింది.
నమ్మలేకపోయాను. దీనంగా ఏడ్చాను.
నా సర్వస్వం నీకర్పించుకొనే బుద్ధి నాకు కలిగింది కాదే అని!





తమకి ఏమి కావాలో, అది ఎక్కడ దొరుకుతుందో
తెలిసిన వారు జీవితంలో పైకి వస్తారు.
ఏ గమ్యానికైనా చాలా దారులు ఉంటాయి...
నీకు ఏది సరైనదో వెతికి పట్టుకోవటమే జీవితం.



రామ్ - 8096339900



www.ramkarri.com

"శ్రూయతాం ధర్మ సర్వస్వం
యదుక్తం గ్రంథకోటిభిః
పరోపకారః పుణ్యాయ
పాపాయ పరపీడనమ్"

అని వ్యాసమహర్షి పాపపుణ్యాలను ఒకేఒక్క శ్లోకపాదంలో నిర్వచించాడు.

మీకు పరులు చేయరాదని ఏది అనుకుంటారో దానిని మీరు ఇతరులకు చేయవద్దు... ఇదే సర్వధర్మముల సూక్ష్మమైన సారము.

రామ్ - 8096339900

" భయపడి చెవులు మూసుకుంటే,
గెలుపు కొట్టే తలుపు చప్పుడు
ఎలా వినిపిస్తుంది."

www.ramkarri.com

మానవ చరిత్రనంతటినీ పరికిస్తే, ఘనకార్యాలు

చేసిన స్త్రీ పురుషుల జీవితాల్లో అన్నింటికన్నా

ఎక్కువగా సామర్థ్యాన్ని ఇచ్చిన మూలశక్తి వారి ఆత్మ

విశ్వాసమే అని తెలుస్తుంది.

తాము ఘనులమనే విశ్వాసంతో వారు జన్మించారు.

ఘనులే అయ్యారు.

రామ్ - 8096339900

వెలుగులో ఇతరుల గొప్పతనం
మనకు కనిపిస్తుంది.

చీకటిలో మన బలహీనతలు
మనకు కనిపిస్తాయి.

తియ్యటి మాటల వెనుక విషం ఉండొచ్చు,
మర్మం తెలుసుకో !
కరుకు వాక్కులు మంచి కోరే కావచ్చు,
పరమార్ధం గ్రహించుకో!
మౌనం ఏమి చెప్పకపోవచ్చు,
అర్ధం వెతుక్కో!
ఎవరి మాటకు బానిసకాకు,
ఆలకించు!
చిరునవ్వుతో నీకు మంచి జరిగే బాటలోనే
సాగిపో!

నెమలి నాట్యం చేస్తు కూడా ఏడుస్తుంది
హంస చస్తూ కూడా పాడుతుంది

జీవిత సూత్రం ఇంతే
దుఃఖంలో ఉంటేనేమో రాత్రంతా మెలకువే
సంతోషంలో ఉంటే అస్సలు నిద్దరే పట్టదు



రామ్ - 8096339900

జీవన సాగరం లో మనసుకి
అలుపొచ్చినపుడు
మీకు ఇష్టమైన వాళ్ళతో
గడిపిన క్షణాలను,
అందమైన, ఆనందమయిన
అనుభవాలను తలుచుకోండి.
ఉత్సాహం మొలకెత్తుతుంది,
చిరునవ్వు విచ్చుకుంటుంది.

# ఆడపడుచు చేత పెళ్ళికొడుకును చేయించేదెందుకు ?

ఆడపిల్ల పుట్టింటి నుంచి అత్తారింటికి వెళ్ళగానే తన పుట్టింటితో అనుబంధమూ, హక్కులూ పోయాయనీ, దూరమయ్యాయని బాధపడుతుంటుంది.

అలాంటిదేమీ లేదు ఈ ఇంట్లో నీ హక్కు అలానే ఉందని చెప్పి, వివాహ సమయంలో తోడపుట్టిన వాడిని పెండ్లికొడుకును చేయించటం దగ్గర్నించి ఆమెకు లాంఛనాలు ఇప్పించటం వరకూ తన ఇంటి పిల్లగా ప్రాధాన్యత కల్పిస్తారు.



అలాగే తాము పోయిన తర్వాత ఆడపిల్లను మగపిల్లలు పట్టించుకోరేమోనని ముందు నుంచి ప్రతి శుభకార్యానికి ఆడపిల్ల తప్పని సరి అని, ఆమె చేతుల మీదగానే ఏదైనా ప్రారంభించాలని చెప్పటమే ప్రధాన ఉద్దేశ్యము.

విజయం నీకు స్నేహితుడూ కాదు పరాజయం నీకు శత్రువూ కాదు రెండూ నీకు క్షణకాల చుట్టరికాలే..



అలసిపోక ఆత్మవిశ్వాసమే

తోడుగా విజయం సాధించు

రామ్ - 8096339900



www.ramkarri.com

కష్టాలు,దుఖాలు మొరిగే కుక్కలాంటివి...



బయపడితే వెంటపడి తరుముతాయి..





ఎదురించి నిలబడితే..
తోకముడుచుకు పారిపోతాయి..



రామ్ - 8096339900

సమస్యలను ఎదురించి పోరాడే వాడే నిజమైన విజేత..

ఆలోచన లేని నిర్ణయానికి ఎంత సమయం
కేటాయించినా నీ జీవితం మారదు.
కానీ చక్కని ఆలోచనతో ఒక్క క్షణంలో
తీసుకునే నిర్ణయం వల్ల నీ జీవితం మారవచ్చు



దూసుకుపోరా... తోసుకుపోరా....... తగ్గనీకు నీ తొందర

రేసుగుర్రమే ఆయసపడితే ...గెలుపు తుర్రుమంటదిరా



ముందరెవడున్న..

పందెమేదైన.....

మొండితనముంటె ఎంతరా??

అస్సలాగద్దు,ఆగి చూడద్దు,చూసి జడవద్దు, హద్దులడగద్దురా

రామ్ - 8096339900

తల వంచుకున్నాడు గదా అని

పలుచన చేయకు

చేయి చాచాడు గదా అని

చులకనగా చూడకు

బ్రతిమిలాడుతున్నాడని

గతిలేని వాడని అనకు

నీ జీవితం ప్రారంభంలో ఇలాంటి అనుభవాలు నీకూ ఉండేఉంటాయి

ఒకప్పటిలా ఇప్పుడు నీవూలేవు

ఇప్పుడున్నట్టు ఎప్పటికీ వీడూ ఇలాగే ఉండడు

వీడి స్థాయికి నువ్వు దిగజారవు గానీ

నీ స్థాయిని మాత్రం ఖచ్చితంగా అందుకోగలడు

ఇంకా నాలో ఆత్మస్థైర్యం మిగిలుంది..
సూర్యకాంతి లేకపోతేనేం దీపముంది!

నాపై నాకున్న నమ్మకమే నా బలం..
నాలోని ధృఢసంకల్పమే నా బలగం!

సానపెట్టే కొలదీ వజ్రం మెరుస్తుంది..
కష్టాల్లో ఒంటరిపోరాటమే గెలుస్తుంది!

కరిగిన కలలకు ఆశయుఎరలే జీవనం..
బ్రతకడానికి వంక దొరికితే అదే వరం!

జీవితమే పగబూని పంతాన్ని కూల్చింది..
నాలో సడలని పట్టుదలే మరో సవాలంది!

రామ్ - 8096339900



ఇదీ జీవితమంటే!

సైకిల్ తొక్కడం కష్టంగా ఉందని...

బైక్‌ను కొనుక్కుని...

దానికంటే సౌకర్యంగా ఉంటుందని

కారు కొనుక్కుని...

దానివల్ల కడుపు పెరిగి...

దాన్ని తగ్గించుకోవడానికి 'జిమ్ము'కు పోతే

అక్కడ నడపడానికి వీలులేని సైకిల్ ఇచ్చి తొక్కమంటున్నారు.



కాబట్టి జీవితం అనేది ఓ చక్రంలాంటిది.

మత్తు వదితే సూర్యోదయంతో గమ్మత్తు ఉంటుంది.

జీవితం చదరంగం లాటి ఒక ఆట
దీన్ని మీరు దేవుడితో ఆడతారు.
మీరు పావుని కదిపిన ప్రతిసారీ
దేవుడు తన పావుని కదుపుతాడు.
మీరు కదిపే పావుల పేర్లు 'ఎంపికలు'
దేవుడి పావుల కదలికలకి
'పర్యవసానాలు' అని పేరు
మీరు పరీక్షకి గురిచేయబడతారు
మీరు సవాళ్ళని ఎదుర్కోవలసి వస్తుంది...
అయినా, మీ ఆటని మీరు బాగా
ఆడుతున్నారని తెలుసుకున్నపుడు
మిమ్మల్ని గెలవనివ్వటం ద్వారా
దేవుడు కూడా గెలుస్తాడు.

www.ramkarri.com

రామ్ - 8096339900

www.ramkarri.com

పిల్లలు ఫెయిల్ అయ్యారని,
వస్తువు చేయ్యిజారి పగిలిపోయిందని,
పాలు పొంగాయని, ఏదైనా మన సొత్తు
దొంగిలించబడిందని ....

కేకలు పెట్టినా, అరిచి గీ పెట్టినా,
ఒత్తిడికి గురై బీపీ పెంచుకున్నా...

చివరకి ఎలాగూ చెయ్యవలసింది
చెయ్యక తప్పనప్పుడు
భావోద్రేకం వద్దు అనవసరం ..
భావ పరిపక్వత సాధించటమంటే
భావాలని పోగొట్టుకోటం కాదు,
భావోద్రేకాలని నివారించటం.

రామ్ - 8096339900



www.ramkarri.com

గతాలు - కష్టమైనవి
జ్ఞాపకాలు - ఇష్టమైనవి
స్మృతులు - మధురమైనవి

శుభోదయం





www.ramkarri.com

జీవితం అనే కురుక్షేత్రంలో
ఆశాంతి దుర్యోధనుడైతే..
వ్యసనం శకుని లాంటిది.
ఇది మన మిత్రుడిలాగే
మనని వెన్నంటి ఉండి
మనం చచ్చిపోయే వరకు
శల్యసారధ్యం చేస్తుంది.

రామ్ - 8096339900

అదృష్టం అంటే మనం కోరుకున్నదే మనకు దక్కడం !
ఆలస్యం అంటే మనం కోరుకున్నదానికోసం ఎదురు చూడటం !
విజయం అంటే మనం కోరుకొని ఎదురు చూసి వెనుకడుగు వేయకపోవడం !
విజయం శాశ్వతం కాదు ! అపజయమే అంతం కాదు !
అందుకనే ప్రయత్నాన్ని ఆపకు ఆశతో లక్ష్యాన్ని చేరుకో !

రామ్ - 8096339900

వస్తూ న్నప్పుడు స్వాగతం చెప్పే
ఊరి మొదటి చెట్టు అది...
వెళ్తూ నప్పుడు ఊరి చివరి చెట్టు
అవుతుంది. రెండింటికి మధ్య
ఆనందానికీ, విషాదానికి మధ్య
పరుచుకున్న అనుభవం ఉంటుంది.

www.ramkarri.com

శుభదినం నేస్తం

మన ఆలోచన ఎప్పుడూ
గొప్పగా ఉండాలి.
కాని వ్యక్తీకరణ మాత్రం తేలికగా,
అందరికీ అర్థమయ్యేలా ఉండాలి

www.ramkarri.com

రామ్ - 8096339900

కొన్ని జ్ఞాపకాలు -
మనని బాధిస్తాయి..
బండరాళ్లలాంటి జ్ఞాపకాలు ..
జీవన సాగరంలో
అవి కరగవు..
కొట్టుకుపోవు....

ప్రశంస ఒక అద్భుతమైన కానుక.
ఇతరులకి ఎంత ఇస్తే
అంత మనకి తిరిగి లభిస్తుంది.

www.ramkarri.com

రామ్ - 8096339900

www.ramkarri.com

అదొక పర్వతశ్రేణి. అక్కడో గుహ. గుహలో ఒక గురువు. గురువు దగ్గరకు ఒక రోజు ఒక ఆశ్రమాధిపతి వచ్చి తన సమస్య చెప్పాడు.

"ఆశ్రమమంతా నిత్యం దైవనామ సంకీర్తనలతో ప్రతిధ్వనిస్తుండేది. అయితే వచ్చేవారి సంఖ్య క్రమంగా తగ్గుతూ వస్తోంది. ఎందుకు తగ్గిపోతోందో అర్థం కావడం లేదు. ప్రస్తుతం మా ఆశ్రమంలో ఉన్నవారిలో శ్రద్ధాసక్తులు తగ్గాయి. ఏదో చెయ్యాలి కనుక చెయ్యాలి అనే ధోరణిలో పనులు చేస్తున్నారు తప్ప ఎవరూ సక్రమంగా తమ బాధ్యతలు నిర్వర్తించడం లేదు. ఈ సమస్య నుంచి గట్టెక్కేదెలాగో తెలుసుకోవడానికే నేను మీ వద్దకు వచ్చాను.." అని ఆశ్రమాధిపతి చెప్పారు.

"మీ ఆశ్రమంలో మీ మధ్యే ఒక దేవదూత ఉన్నారు. ఆయనను మీరు తెలుసుకోలేకపోతున్నారు. అది తెలుసుకుంటే చాలు. మీరనుకున్న సమస్య కొలిక్కి వస్తుంది" అని చెప్పారు గురువు. ఆశ్రమాధిపతి ఆశ్రమానికి వచ్చి ఆశ్రమవాసులందరినీ పిలిచి గురువుగారి మాటలను చెప్పారు.

ఆయన మాటలు విన్న వారందరూ నిశ్చేష్టులయ్యారు. ఒకరినొకరు చూసుకున్నారు. ఏమిటీ మనలో ఓ దేవదూత ఉన్నారా? ఎవరై ఉంటారు? అని ఒకరినొకరు మనసులో అనుకున్నారే తప్ప ఒక నిర్ణయానికి రాలేకపోతున్నారు. ఈ వాస్తవాన్ని తాము కనిపెట్టలేమనుకున్నారు. అందుకే అప్పటి నుంచి ఒకరినొకరు మర్యాదపూర్వకంగా పలకరించుకోవడంతోపాటు వినయవిధేయతలతో నడుచుకున్నారు. ఫలానా వ్యక్తే దేవదూత అయి ఉండవచ్చని అనుకుంటూ ఎంతో చక్కగా మాట్లాడుకుంటూ కలసిమెలసిపోయారు.

ఎవరూ ఎవరినీ నొప్పించకుండా ప్రవర్తించారు. ఫలితంగా, ఆశ్రమంలో ఆనందకరమైన ఆహ్లాదకరమైన వాతావరణంతోపాటు ఆధ్యాత్మిక వికాసం వెల్లివిరిసింది. ఇదంతా చూసిన తర్వాత ఆశ్రమ అధిపతి దేవదూత ఇంకెక్కడో లేరని, తమలోనే ఉన్నారనే నిజాన్ని తెలుసుకున్నారు.

కళ్ళు చూడలేకపోవచ్చు. కానీ మనసు చూపు కోల్పోకూడదు. లోపల ఉన్నదే వెలుపలా ఉంటుందని తెలుసుకుంటే చాలు. తనలాగానే ఎదుటివారినీ ప్రేమించాలి.

రామ్ - 8096339900

ప్రేమ, నమ్మకం, గౌరవం, చనువు (లవ్, ట్రస్ట్, రెస్పెక్ట్, ఇంటిమసీ)... ఇవి నాలుగూ కుటుంబానికి మూలస్తంభాలు. ఇందులో ఏ స్తంభం బలహీనంగా ఉన్నా ఆ కుటుంబ సౌధం ఒక పక్కకి ఒరిగిపోతుంది. అలా నెమ్మదిగా ఆ భవనం కూలిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అందుకే దంపతులు ఈ నాలుగు స్తంభాలను పటిష్టం చేసుకోవాలి. అది వారి చేతుల్లోనే ఉంటుంది.



ఇద్దరి మధ్యన కనెక్టివిటీ ఉండేలా చూసుకోవాలి. మీ మాటలు చేతలతో భాగస్వామిపట్ల మీకుగల ప్రేమాభిమానాలు వెల్లడిచేయండి. భాగస్వామితో ఆప్యాయంగా మాట్లాడండి, బాధ్యతగా మెలగండి . ఆత్మీయతతో కూడిన చిన్న స్పర్శ , అభినందనతో కూడిన చిన్న మెచ్చుకోలు మరింత దగ్గర చేస్తాయి.

రామ్ - 8096339900



www.ramkarri.com

మనందరిలోనూ
చెడు తలంపులు ఉంటాయి.
కానీ మనలో కొందరే చెడు
చేసేవారుంటారు.





అలాగే మనందరం మంచి చేయగలం.
కానీ మనలో కొందరే మంచి
ఆలోచనలు చేసేవారుంటారు.

రామ్ - 8096339900

మన పిల్లలకి... వాళ్ళు తమ జీవితకాలంలో చదివే ఒకే ఒక
ఖురాన్ మనమే; వాళ్ళు చూడగల వేదాలు కూడా మనం
మాత్రమే; వాళ్ళు అనుభవించగల ఏకైక బైబిల్ మనమే;
మన జీవితం వాళ్ళకి ఒక హెచ్చరికగా కాని,
ఒక ఉదాహరణంగా కాని పనికొస్తుంది.



రామ్ - 8096339900

www.ramkarri.com

మన చేసే తప్పులు, పొరపాట్లే మనకి కొన్ని పాఠాలు నేర్పితే
మరికొన్ని గుణపాఠాలూ నేర్పుతాయి.
మన అనుభవాలు-గుణపాఠాలు మనకు మాత్రమే గాక
ఎదుటివారికీ పాఠాలుగా పనికివస్తాయి.



www.ramkarri.com

ఒక రాజ గురువు, తెలివైన శిష్యుడికోసం వెతుకుతూ, నలుగురిని ఎంపిక చేసి తన ఆశ్రమానికి తీసుకెళ్లి చిన్న పరీక్ష పెట్టాడు. మీలో తెలివి తేటలు, బుద్ధిబలం, భుజబలం, సృజనాత్మకత ఏ స్థాయిలో ఉన్నాయో తెలుసుకోవాలి. ఎవరైతే ఈ పరీక్షలో నెగ్గుతారో, వారినే శిష్యుడిగా తీసుకుంటాను. నేనిప్పుడు అడవిలోకి వెళ్ళి, రాత్రి సమయానికి వస్తాను. మీరు నలుగురు నాలుగు కూటిరాల్లోనికి వెళ్ళి, నేను వచ్చేసరికి వాటిని పూర్తిగా ఏదో ఒక దానితో నింపాలి" అని చెప్పి వెళ్లాడు. మొదటివాడు తన బలంతో పక్క అడవిలో గడ్డికొసుకొచ్చి, గదంతా గడ్డితో నింపాడు. రెండవవాడు పక్కనే దిగుడుబావిలోని నీటిని తోడి గదంతా నీళ్ళతో నింపాడు. మూడవవాడు పక్కనే ఉన్న గొడ్లసాల నుండి పేడ, మట్టి తెచ్చి గదిలో కుప్పలుగా పోసి భయంకరమైన వాసనతో నింపాడు. ఆఖరివాడికి ఏం చేయాలో తోచలేదు, బక్కప్రాణి, ఏదైన మోయాలన్న అంతశక్తి లేదు. చీకటి పడింది, గురువుగారు వస్తున్నట్లు తెలిసి అందరు తమ తమ కుటీరాలా ముందు చేతులు కట్టుకొని నిలబడ్డారు. ఆఖరి వ్యక్తి చటుక్కున గదిలోకి వెళ్ళి నిమిషంలో వెనిక్కి వచ్చి అందరిలాగే చేతులు కట్టుకొని నిలబడ్డాడు. గురువుగారు వచ్చి నాలుగు కుటీరాలు చూసి, ఆఖరి వ్యక్తిని కౌగలించుకొని "నువ్వే నాకు తగిన శిష్యుడివి" అని చెప్పారు. ఆఖరి వ్యక్తి చివరలో గదిలోకి వెళ్ళి చేసిన పని... దీపం వెలిగించి వచ్చాడు. గదంతా కాంతితో నింపాడు.

ఒకాయన దగ్గర ఒక కార్పెంటర్ పని చేస్తుంటాడు. కార్పెంటర్ మంచి పనిమంతుడు. తన జీవితం లో ఎన్నో ఇల్లు కట్టాడు. ఎందరినో ఒక ఇంటి వాళ్ళని చేసాడు, అతనంటే యజమాని కి మంచి గురి. చాలా కాలం పని చేసి కొన్నాళ్ళు గడిచాక 'నేను అలసిపోయాను; సెలవు ఇప్పించమని యజమానిని అడిగాడు. యజమాని బాగా అలోచించి చివరగా వెళ్లేముందు ఒక ఇంటిని నిర్మించి ఇవ్వమని అడుగుతాడు. ఇన్ని రోజులు పని చేసిన యజమానికి కనికరం లేదు అని బాధపడుతూ కార్పెంటర్ చేసేది లేక ఇంటిని నిర్మించుతాడు. అయితే పని అంతా నిర్లక్షంగా చేస్తాడు, నాలుగు వాసాలు పడేచోట మూడే వేస్తాడు. పది రోజులు తడపాల్సిన ఇంటి గోడల్ని వారమే తడుపుతాడు. తూతూమంత్రంగా ఇంటి పని పూర్తి చేసి యజమాని దగ్గరకు వెళ్లి 'ఇంటి పని అయింది నేను వెళ్తాను' అంటాడు. అపుడు యజమాని 'ఎక్కడకి వెళ్తావు? ఆ ఇల్లు నీదే' అంటాడు. పశ్చాత్తాపం చెందడం కార్పెంటర్ వంతవుతుంది. నిర్లక్షంగా పని చేయకూడదన్న నీతి ఒక్కటే ఇందులో లేదు.

భగవంతుడు మనకి ఏ రూపంలో ఎవరి ద్వారా ఏమి ఇస్తాడో తెలియదు. అయన ఇచ్చే సమయానికి మనం తలుపులు మూసుకుంటుంటాం.

ఏం చేస్తున్నావని ఓ పని వాడిని అడిగితే 'ఇటుకలు మోస్తున్నా' అని చెప్పొచ్చు లేదా 'ఇంటిని నిర్మిస్తున్నా' అని చెప్పొచ్చు, అంత మన ఆలోచనలో ఉంది.

ప్రతి పనినీ మన కోసమే అన్నంత బాగా చేసుకుంటే అది దైవకార్యం అవుతుంది. దేవుడికి పెట్టిన ప్రతిది మనదే అవుతుంది కదా!

గద్ద జీవితకాలం 70 ఏళ్లు. తమ జాతి పక్షుల్లో అతి ఎక్కువ జీవితకాలం గద్దదే. అయితే 40 ఏళ్లు పూర్తి అయ్యేసరికి.. బాగా పొడవుగా పెరిగిన దాని గోళ్లు.. ఆహారాన్ని పట్టుకోవడానికి సహకరించవు. పొడవైన దాని ముక్కు కొన చివర వొంగి పోయి.. పట్టుకున్న ఆహారాన్ని ఛేదించి, నోటితో స్వీకరించడానికి సహకరించదు. ఈకలు దట్టంగా పెరిగిన దాని రెక్కలు బరువై... చురుకుగా ఎగరడానికి సహకరించవు. ఆ వయసులో దాని ముందున్నవి రెండే మార్గాలు.. ఒకటి ఆహారాన్ని సంపాదించు కోలేక సుష్కించి మరణించటం.. రెండోది, బాధాకరమైనదైనా తనను తాను మార్చుకోవడం. గద్ద రెండో మార్గాన్నే ఎంచుకుంటుంది. ఈ మార్పు దాదాపు 150 రోజుల ప్రక్రియ. ఈ మార్పు కోసం గద్ద అందుబాటులో ఉన్న శిఖరాగ్రంపై కూర్చొని.. పెరిగి పోయిన తన ముక్కు కొనను.. కాలిగోళ్ల మధ్య పెట్టుకొని ఎంతో బాధ కలిగినా, నెమ్మదిగా వొలిచేసుకుంటుంది. ఊడ గొట్టుకున్న చోట తన ముక్కు పదునుగా కొత్తగా పెరిగే వరకు ఎదురు చూస్తుంది. పదునుగా పెరిగిన కొత్త ముక్కుతో అవసరాన్ని మించి పెరిగిన కాలిగోళ్లను ఊడపెరుక్కుంటుంది. కొత్త గోళ్లు పెరిగిన తర్వాత.. వాటి సాయంతో తన పాత ఈకలను పీకేస్తుంది. అలా బరువుగా ఉన్న తన రెక్కలను తేలికగా మార్చుకుంటుంది. ఇలా 5 నెలల బాధాకరమైన పరిశ్రమ, కృషితో సాధించుకున్న పునర్జన్మతో మరో 30 ఏళ్లు హాయిగా జీవిస్తుంది. సృష్టిలో మనగలగడానికి మార్పు అత్యవసరం... అనే జీవిత సత్యాన్ని గద్ద జీవించి, మనల్ని కూడా అలా జీవించమని బోధిస్తుంది.





రామ్ - 8096339900

విజయాల తలుపులు తీయడానికి
అపజయాల మెట్లను ఎక్కాలి.

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

గెలుపు అందరికీ దొరకదు .

అయితే

గెలిచే శక్తి అందరిలో ఉంటుంది

రామ్ - 8096339900



www.ramkarri.com


సంతోషం సీతాకోకచిలుక లాంటిది.
దాని కోసం పరిగెత్తితే
అందకుండా ఎగిరిపోతుంది.
ప్రశాంతంగా కూర్చుంటే
అలకోకగా వచ్చి పైన వాల్తుంది.
www.ramkarri.com
రామ్ - 8096339900

బాధ్యతకూ ప్రేమకూ తేడా ఉంది. పొద్దున్నే కాఫీ కలిపివ్వడం బాధ్యతా? ప్రేమా? జీతం రాగానే భార్య చేతిలో పెట్టడం బాధ్యతా? ప్రేమా? పొరపాటుగా రోడ్డు మీదకు వచ్చిన మూడేళ్ళ కూతురు ఇంకో క్షణమైతే కారు కింద పడేదని తెలిసినప్పుడు, తల్లి ఆ పిల్లను అక్కున చేర్చుకోనేది పోయి దెబ్బలు వేస్తుంది. ప్రేమతో శిక్ష విధించినట్టా? కూతురి సంరక్షణ బాధ్యతను నిర్వహించినట్టా? మనం ప్రేమకన్నా బాధ్యతే ఎక్కువగా వ్యక్తం చేస్తుంటాం. కాని దాన్ని ప్రేమగా పొరపడుతుంటాం. బాధ్యతగా ఉండటమంటే, ప్రేమించకుండా ఉండటం కాదు. ప్రేమగా ఉండటమంటే, బాధ్యతను విస్మరించడమూ కాదు. ఎంతో ప్రేమను వ్యక్తం చేయగల శక్తి మనలో ఉంది. కానీ మన ఇంట్లో మన వాళ్ళను మాత్రం విసుక్కుంటాం. చిన్న విషయానికి చిరాకుపడతాం. చిన్నబుచ్చుతాం. పక్కింటి పిల్లాడితో మాట్లాడినంత ఆప్యాయతగా మన పిల్లలతో ఎందుకు మాట్లాడం? దీనికంతటికి కారణం మనం మన వారిని ' మన వారే కాదా' అని అశ్రద్ధ చేయడం.... అశ్రద్ధ ప్రేమ వ్యక్తం చేయడంలో మాత్రమే జరుగుతుంది. నిజానికి మనం ఎక్కువ ప్రేమించేది మన పిల్లలనే. అయినా దాన్ని తరచు ప్రకటించం. ప్రేమ కడుపులో ఉంటే చాలదు. దాన్ని కళ్ళల్లో చూపించాలి, మాటల్లో చెప్పాలి, చేతల్లో ప్రదర్శించాలి. అడగనిదే అమ్మయినా అన్నం పెట్టదంటారు. చెప్పనిదే కొడుకుకైనా మనం ఎంత ప్రేమిస్తున్నామో తెలియదు. ప్రేమను పంచడమే కాదు, ప్రేమని చెప్పండి, మాటల నెయ్యి జల్లి, ప్రేమ భోజనం వడ్డించండి.



రామ్ - 8096339900


శుభోదయం నేస్తం
సంతోషాలు వికసించిన సుమాలు.
వాటి జ్ఞాపకాలు ఎప్పటికీ
వాడిపోని సుమగంధాలు.
రామ్ - 8096339900
www.ramkarri.com


సింహాన్ని ఎవరూ ఆహ్వానించి
అడవికి రాజును చేయలేదు..
దాని శక్తి సామర్థ్యాలే
దానికి ఆ ఘనతను తెచ్చి పెట్టాయి...
మనిషికైనా అంతే....
రామ్ - 8096339900
www.ramkarri.com

మన ఇళ్లల్లోగానీ, బంధుత్వాల్లో గానీ ఏదైనా పొరపాటు జరగగానే ముందు ఎదుటివాడిదే తప్పని తీర్మానిస్తాం. మనస్ఫూర్తిగానే ఎదుటివాళ్ళే తప్పు చేశారని నమ్ముతాం. ముఖ్యంగా మన కుటుంబ సంబంధాల్లో, భార్య తప్పు చేసింది అనేముందు భర్త, ఇది ఆయనవల్లే జరిగి ఉంటుందని అనుకునే ముందు ఆమె... ఒక్క సారైనా ఆలోచించాలి. మనలో చాలామంది ఎదుటివాడు తప్పుగా ఉన్నాడని అనుకుంటాంగానీ, మన దగ్గర తప్పు ఉందని గుర్తించం. మన హృదయాన్ని గది అనుకుంటే కిటికీలు కళ్ళు వాటితో ఎలా చూస్తున్నామనే దాని బట్టి, సంబంధాలు ఆధారపడి ఉంటాయి. కళ్ళల్లో ఒక నలక పడితేనే ఎంతో చికాకుగా ఉంటుంది. అలాంటిది ఇతరులలో తప్పు ఎంచడమనే దుమ్ము మీ కళ్ళల్లో పేరుకు పోయుంటే ఎంత విసుగ్గా ఉంటుంది! సంబంధాలు ఎంతగా స్ట్రైయిన్ అవుతాయి! గుండె కిటికీలను శుభ్రంగా తుడుచుకోండి. అప్పుడు బంధాలన్నీ ఇంకా కొత్తగా, తేటగా కనబడతాయి.



శుభోదయం నేస్తం

www.ramkarri.com

ఆలోచనలు మంచివైతే నీ పయనం మంచి వైపు
అంటే నీ ఆలోచనల సమాహారమే
నీ జీవితాన్ని నడిపేది

రామ్ - 8096339900

www.ramkarri.com

జ్ఞాపకాలు హృదయంలో ఎప్పటికీ పదిలంగా వుంటాయి,
వెల్లువెత్తే జ్ఞాపకాలు ఎదలో చెరగని గురుతులు.
కొన్ని జ్ఞాపకాలు తీయగా ఉంటాయి,
పదిలంగా ఉంటాయి.
కొన్ని జ్ఞాపకాలు చేదుగా ఉంటాయి,
వెంటాడుతూ ఉంటాయి.
కొన్ని జ్ఞాపకాలను మరిచిపోకాలన్నా మరిచిపోనివ్వవు,
కాలంతో పాటు నడుస్తాయి.
జ్ఞాపకాల జడివానలు గత,వర్తమానాల సమ్మేళనం.
నిరంతరం మనల్ని ముందుకు నడిపించే మూలాలు.
ఏదో ఒక సందర్భంలో నిస్పృహకు లోనైనప్పుడు మనలో
చైతన్యాన్ని నింపే ఉత్ప్రేరకాలు.




సంకేతిక లోకమా, లోపమా?

# సహాయమే సహజ లక్షణం





ఇతరులకు సహాయం చేయడమనేది ఓ అందమైన వ్యసనం.

చేయడంలో వ్యసనం లేదు.

చేసాక కలిగే ఆనందం లో ఉంది.

ఆ ఆనందం మనమేదో చేశామన్నది కాదు.

మన సహాయంతో ఇత రుల కష్టాన్ని తీర్చినప్పుడు

వారి కళ్ళల్లో కలిగే ఊరట, వెలిగే సంతోషం

మన హృదయానికి కలిగించే తృప్తి...

మనం కోసం మనం ఏమి చేసుకున్నా రాదు.

ఆ ఆనందం, ఆ తృప్తి మనకు వ్యసనం అవుతుంది.

అవ్వాలి కూడా! ఈ కిటుకు తెలిసిన

వారు ఆనందం కోసం ఎక్కడెక్కడో వెతకరు.

దాన్ని కొనుక్కునే డబ్బు కోసం వెంపర్లాడరు.

ఇతరులకు సహాయం చేయడమనేది

మానవ ధర్మం... హృదయ లక్షణం...



ప్రవర్తన అనేది చెట్టు అయితే



గుర్తింపు అనేది దాని నీడలాంటిది.

రామ్ - 8096339900




ప్రతి వ్యక్తిలోనూ ఋషికి, రాక్షసునికి ఉండే ఆలోచనలు
రెండూ ఉంటాయి. మనం దేనిని 'చైతన్యం' చేస్తామన్నదానిపై
ఆ వ్యక్తి గమనం, గమ్యం ఆధారపడి ఉంటుంది. కాబట్టి
నీ ఆలోచనల బట్టే నీ ఎదుగుదల ఆధారపడి వుంటుంది

ఎంతో ఎత్తుకు ఎదగాలని ఆలోచిస్తూ
కూర్చొంటే లాభం లేదు
లే, లేచి నిలబడు
అన్వేషించు,ఆలోచించు,ఆచరించు
అప్పుడే అసాధ్యాలు సుసాధ్యం అయ్యేది
అద్భుతాలు జరిగేది

రామ్ - 8096339900

ఒక మనిషి నిన్ను ద్వేషించడానికి ఈ మూడింటిలో
ఏదో ఒక కారణం తప్పక ఉంటుంది...

నీలాగా ఉండాలని అనుకోవటం,
తనను తాను అసహ్యించుకోవటం,
వాళ్లకు మనవల్ల ముప్పు ఉందని అనిపించడం!

రామ్ - 8096339900
www.ramkarri.com

అందని వాటికోసం ఆరాటం. అందినవి మాత్రం పనికి రావు
అసలు అందని ప్రతి వస్తువూ ఆశలు రేపుతుంది. అందితే మాత్రం
అలవాటయిపోతుంది. అందిన కొన్ని రోజులదాకా దాని మీద మోజు
ఉన్నా క్రమేణా తగ్గిపోయి దాని విలువనే మరచిపోతారు. వస్తువులో
మార్పేం ఉండదు మరి తగ్గింది మన మోజే. అయినా అందని
వాటికి ఆరాటమూ, అందినవి పనికిరాక పోవటమూ మామూలే.

www.ramkarri.com

అందినవి పనికిరాక పోవటమూ, అందనివాటికోసం ఆరాటమూ,
అందీ అందనివాటితో చెలగాటమూ చేయటం మన స్వభావం.
అందని అందాలెప్పుడూ మధురాలే.

రామ్ - 8096339900

# ఎదురు చూపులు.......



ఎంత చిన్ని మాట. అయితేనేం!
తనలో ఎన్నెన్ని భావావేశాలను దాచుకుంది!
పరిచయం అక్కర్లేని పదంగా అందరికీ సుపరిచితమే
కన్నుల ప్రమిదలలో.. చూపుల ఒత్తులు వేసి అంతులేని నిరీక్షణ
ఒక్కొక్కరిది ఒక్కో రకం ఎదురుచూపులు.

వాన కోసం రైతు, చినుకు కోసం పైరు, బిడ్డ కోసం తల్లి,
భర్త కోసం భార్య, కన్న బిడ్డల ఉత్తరం కోసం తల్లిదండ్రులు...
ఎదురుచూస్తూనే వుంటారు. ఎదురు చూపుల్లో ఎంత తేడా!
ఎదురు చూపులు మరిచిపోలేని అనుభూతి
కాల ప్రవాహంలో నిరంతరం జరిగే ప్రక్రియ ఇది.

రామ్ - 8096339900

www.ramkarri.com

# శుభోదయం నేస్తం

మనలను మన ఆలోచనతే తీర్చిదిద్దుతాయి
ఆలోచనతే కలకాలం ఉంటాయి ,
సుదూరము ప్రయాణము చేస్తాయి

రామ్ - 8096339900

శుభోదయం

జ్ఞానం శక్తిని ఇస్తుంది.
ప్రవర్తన గౌరవాన్ని ఇస్తుంది.

రామ్ - 8096339900

మనసులోఆలోచన అనే వాకిలి తెరుచుకుంటే
దానికుండే ఉద్రేకం పారిపోతుంది.
ప్రశాంతత లోనికొస్తుంది.

శుభదినం

రామ్ - 8096339900

www.ramkarri.com

అమ్మ పేరు వినగానే ప్రేమ గుర్తుకు వస్తుంది
నాన్న పేరు వినగానే బాధ్యత గుర్తుకు వస్తుంది
అక్క పేరు వినగానే అనురాగం గుర్తుకు వస్తుంది
అన్న పేరు వినగానే గిల్లికజ్జాలు గుర్తుకు వస్తాయి
కాని అదేమీ చిత్రమూ స్నేహితుని పేరు వినగానే
పైవన్నీ గుర్తుకు వస్తాయి


మమకారానికి
మరో ప్రతిరూపం
నాన్న...
తొలిగురువు
అమ్మ అయితే
మలి గురువు
నాన్న...
రామ్ - 8096339900
www.ramkarri.com


జ్ఞానోదయం కావడానికి బోధివృక్షాలే అక్కర్లేదు.
మనసును కదిలించే ఒక్క దృశ్యం చాలు.
అది నిలువెల్లా పట్టి కుదిపేస్తుంది.
హృదయాన్ని మెలిపెడుతుంది.
రామ్ - 8096339900
www.ramkarri.com

ఒక యోగి మరణశయ్య మీదున్నాడు. తన శిష్యులకు తాను
స్వర్గానికి పోవడానికి నిశ్చయించుకున్నట్లు తెలిపాడు.
"దేవుడి మనసులో ఏముందో నాకు తెలియదు.
నా మనసులో ఏముందో నాకు తెలుసు.

మిగతావాళ్లు నరకం అనుకునే ప్రదేశానికి
నన్ను పంపినా, దాన్ని కూడా స్వర్గంగా
భావించడం నాకు తెలుసు," అన్నాడా యోగి.

నిజమే! మీ అంతరంగం దేన్నైనా స్వర్గంగా
మార్చవచ్చు. లేదా నరకంగా చేయవచ్చు.
అది బాహ్య స్థితి వల్ల కాదు. బయట
పరిస్థితులెలా ఉన్నా అంతరంగంలో
ఎప్పుడూ స్వర్గమే!

రామ్ - 8096339900



www.ramkarri.com

ఓడిపోతామేమో అనే భయం
గెలుపును శాశ్వతంగా దూరం చేస్తుంది.



ఒకదారి
మూసుకుపోయిందని
బాధపడకూడదు.. వేల దారులు మనకోసం
తెరచుకున్నాయని ఆనందించాలి.



www.ramkarri.com

సమస్య వెనుక సమాధానం ఉంది
దుఃఖం వెనుక సుఖం ఖాయం
ప్రతి కష్టం గొప్ప మార్పుకు కారణం
ఓర్పు లో వుంది విజయం







www.ramkarri.com

ఇద్దరి మధ్య ఉండే సంబంధంలో తప్పెవరిది అన్నది కాదు ప్రశ్న,
జీవితం ఎవరిది అనేదే అసలు ప్రశ్న!
స్పందించటం సానుకూలమైనది, ప్రతిక్రియ వ్యతిరేకమైనది.
ఎదుటివాళ్ళ ప్రవర్తన బట్టి మీ ప్రవర్తన మార్చుకోవద్దు. ఏం
చేసినా...మీ వ్యక్తిత్వాన్ని బట్టే జీవించండి. తప్పు కి తప్పు అనే
స్పందన సరైనది కాదు..

అనుభవాల ద్వారా ఇతరులకన్నా మెరుగ్గా
ఎలా ఉండాలో నేర్చుకోవాలి, అంతేకానీ
వాళ్ళు ప్రవర్తించినట్టే.. ప్రవర్తించటం కాదు.
ఈ ప్రపంచం వల్ల జీవితాన్ని అందంగా
ఉండనివ్వండి.
ఈ ప్రపంచం ఎలా ఉన్నా జీవితం అందంగా
ఉండేట్టు చూసుకోండి .

రామ్ - 8096339900

www.ramkarri.com

గెలుస్తూంటే నీ నీడతో కరచాలనం చేయటానికి
కూడా జనం పరుగెడతారు.
ఓటమి చీకట్లో నీ నీడ కూడా
నీ పక్క నుంచి మాయమైపోతుంది. -



రామ్ - 8096339900

www.ramkarri.com

మానవత్వంపై నమ్మకం కోల్పోకూడదు.
సముద్రంలోని కొన్ని చుక్కల్లో కాలుష్యం
చేరినంత మాత్రాన సముద్రమంతా కలుషితం కాదు.
మానవత్వం కూడా ఒక సముద్రం వంటిది...

రామ్ - 8096339900

ఓసారి ఓ వ్యక్తి ఒక గురువును పరీక్షించాలనుకున్నాడు.
ఒక పక్షి మెడను చేతితో గట్టిగా నొక్కిపెట్టాడు. రెండు చేతులూ
వెనక్కి పెట్టుకుని, గురువు దగ్గరకు వెళ్లాడు.
'గురువుగారూ, నా చేతిలో ఓ పక్షి ఉంది. అది ప్రాణాలతో
ఉందా, చచ్చిపోయిందా' అనడిగాడు.
ప్రాణాలతో ఉంది అని గురువు అంటే పీక పిసికి చంపేయాలని,
చనిపోయింది అంటే ప్రాణాలతో గాల్లోకి ఎగరేద్దామని
అనుకున్నాడు. అతని ఆంతర్యాన్ని గ్రహించిన గురువు చిన్నగా
నవ్వాడు. గురువు మాట్లాడకపోవడంతో
ఆ వ్యక్తి మళ్లీ అడిగాడు-
'నా చేతిలో ఉన్న పక్షికి ప్రాణం ఉందా?'
గురువు చెప్పాడు.
'పక్షి ప్రాణం నీ చేతుల్లో ఉంది' -


మూర్ఖులు సుఖం ఎక్కడో ఉందని
ఎదురు చూస్తుంటారు..
www.ramkarri.com
కానీ వివేకవంతులు తమ దగ్గరున్న
దానితో ఆనందంతో జీవిస్తారు..
రామ్ - 8096339900

స్వేచ్ఛ లేని జీవితం,
ఆత్మ లేని శరీరంలాంటిది



శుభోదయం



రామ్ - 8096339900

www.ramkarri.com

సంతృప్తికరమైన ఈ రోజుకి
నమ్మకమైన రేపుకి
మధ్య వంతెన నిద్ర.
అటూ ఇటూ ఆ రెండూ బావుంటే,
మధ్య వంతెన బావుంటుంది.

శుభరాత్రి

రామ్ - 8096339900



www.ramkarri.com

నింగికెగరాలనే నీ
వాంఛ తప్పేమీ కాదు
అది నీలో ప్రజ్వరిల్లుతున్న
పట్టుదలకు నిదర్శనం

అందని వాటికోసం ఆరాటం. అందినవి మాత్రం పనికి రావు
అసలు అందని ప్రతి వస్తువూ ఆశలు రేపుతుంది. అందితే మాత్రం
అలవాటయిపోతుంది. అందిన కొన్ని రోజులదాకా దాని మీద మోజు
ఉన్నా క్రమేణా తగ్గిపోయి దాని విలువనే మరచిపోతారు. వస్తువులో
మార్పేం ఉండదు మరి తగ్గింది మన మోజే. అయినా అందని
వాటికి ఆరాటమూ, అందినవి పనికిరాక పోవటమూ మామూలే.



అందినవి పనికిరాక పోవటమూ, అందనివాటికోసం ఆరాటమూ,
అందీ అందనివాటితో చేలగాటమూ చేయటం మన స్వభావం.
అందని అందాలెప్పుడూ మధురాలే.

రామ్ - 8096339900

ఆలోచన వికసించే పుష్పం,
ఆలాపన దానికి అంకురం,
ఆచరణయే ఫలం.



www.ramkarri.com

ఒకరికి మంచి అనిపించేది మరొకరికి చెడు అనిపిస్తుంది,
మరొకరికి పిచ్చితనం అనిపిస్తుంది. ఒక్కటే విషయం,
చూసే మనిషి దృక్పథాన్ని బట్టి
అభిప్రాయం మారుతూ ఉంటుంది

శుభ సాయంత్రం

ఒక్క రోజులో మహావృక్షం కాలేవు.....

విత్తుగా ఉన్నప్పుడు నువ్వెవరికీ తెలియదు

భూమిని చీల్చి మొలకగా మారినా నిన్నెవరూ పట్టించుకోరు

ఓపికపట్టి మొక్కవై ఎదిగినా నిన్నెవరూ గమనించరు

ఎండ వానలకోర్చి చెట్టుగా మారినపుడు నిన్ను గుర్తిస్తుంది లోకం

కాయలు కాచి, పళ్ళ నిస్తున్నపుడు నీ వెంటపడుతుంది సమాజం

మహావృక్షమై ఎదిగిన నాడు నీ నీడకై పరితపిస్తుంది ప్రపంచం..............................

రామ్ - 8096339900

www.ramkarri.com



చీకటి వెలుతురికి దారి



ఇవ్వక తప్పదు...

కష్టాలు సుఖాలకి దారి

ఇవ్వక తప్పదు...

రామ్ - 8096339900

జీవిత ప్రయాణపు
ప్రతి మలుపులోనూ
ప్రమాదాలుంటాయ్.
ధైర్యంతో ముందుకు
వెళ్ళాలి గానీ,
వాటికి భయపడి
ప్రయాణమే ఆపితే,
జీవితానికి అర్థమే లేదు.



రామ్ - 8096339900

మబ్బు మసకేసినప్పుడు,
మంచుదుప్పటి కప్పేసినప్పుడు,
నలుదిక్కులా మౌనం కమ్మేసినప్పుడు..

వినే మనసుండాలే కాని
నీటి నుంచి సంగీతం వినిపిస్తుంది.
ఈ చల్లని నీళ్లలో ఏ ఊసులు దాగెనో!

రామ్ - 8096339900

www.ramkarri.com

తీరికే లేని విశ్వ సంసారమందు
అలసి పోయితివేమొ దేవాదిదేవ
ఒక నిమేషమ్ము కన్ను మూయుదువు గాని
రమ్ము! తెరచితి మా కుటీరమ్ము తలుపు



ఎంత చక్కటి పద్యం ... మామూలు సంసారినికే సతమతమయిపోయి విశ్రాంతి కోసం వెంపర్లాడుతున్నామే మనం, తీరికలేని విశ్వ సంసారమందు ఎంత అలసిపోయి ఉన్నాడో గదా ఆ జగదీస్వరుడు. ఓ విశ్వసంసారి ...మురారీ.. ఒకసారి.... మాత్రమే మా ఇంటికి వచ్చిపో.... చాలు ప్రభో .... ఆ విశ్వసంసారికి తీరిక దొరికిన సమయంలో మన హృదయ కుటీరంలో విశ్రమించడానికి వస్తాడేమో ఎందుకైనా మంచిది అంతర్యపు ద్వారం తెరిచి ఉంచటమే మంచిది మరి .....

రామ్ - 8096339900

ఏదైనా చేయాలన్న తపన మనిషిని
ఎంత ఎత్తుకైనా తీసుకెళ్తుంది.
ఏదైనా సాధించాలన్న కసి,
దేనినైనా సాధ్యమయ్యేలా చేస్తుంది.
అందుకే ఏకలవ్యుడు అంత గొప్ప
విలుకాడు అయ్యాడు.

# శుభోదయం మిత్రమా!



మనుషుల మధ్య మనసులు గోడలు కట్టుకున్న,
వాటిని అనుబంధాలతో కలిపి ముడి వేయండి

రామ్ - 8096339900

www.ramkarri.com

బరువు, బాధ్యతలు లేని రోజులతో గడచిన అల్లరి చిల్లరి చిన్నతనం

బాధ్యతలు, భవబంధాలు మధ్య క్షణ క్షణం నలుగుతున్న పెద్దతనం

బాధ్యతలు తీరేలోపే కాళ్ళు కీళ్ళు అరిగి ముంచుకొచ్చే ముసలితనం

బతికీడ్చే వారు తప్ప, జీవించేవారు తగ్గిన ప్రపంచ మానవ జీవనపటం



ఉన్నంతలో సర్దుకోవాలి
ఉన్నంతలోనే ఒద్దికగా ఉండాలి

నీడనైనా నమ్మలేని రోజులివి
కబుర్లే కాని చేతలు లేని మాయలివి

ఎవరో వస్తారని, ఏదో చేస్తారని
వేచి చూసే ఆశలొద్దని

నీకు నీ గమ్యం, లక్ష్యం ముఖ్యం
ఎవరికోసమూ ఆగని సమయం

నీవు నడిచే బాటలో ఎన్నెన్ని అడ్డంకులు
అధిగమిస్తే నీ వద్దకే అందరు, నీకే మన్ననలు

రామ్ - 8096339900

www.ramkarri.com

నేను నమ్మిన మిత్రులు
నేను ఓడిపోవాలనుకుంటున్నారు

నన్ను నమ్మిన మిత్రులు
నేను గెలుపొందాలనుకుంటున్నారు



నన్ను నమ్మిన వారి కోసం
నేను ఖచ్చితంగా గెలిచి తీరుతాను
ఆ సత్తా నాలో ఉంది.

రామ్ - 8096339900

తన చుట్టూ ముళ్ళున్నా
విరియుట మానునా విరులు

తన చుట్టూ బురద ఉన్నా
వికసించదా కమలము

వట వృక్షపు నీడనున్నా
మొలకెత్తదా విత్తనము

జీవితానికి ఒక ఆశయం ఉంటే
ప్రతికూల పరిస్థితులు
ప్రతిబంధకాలు కాలేవు ఏనాడూ.....



రామ్ - 8096339900



ఏళ్ల తరబడి నీళ్లలోనే
ఉన్న రాయి మెత్తబడదు.
ఎన్ని కష్టాలు చుట్టుముట్టినా
ధీరుడు ఆత్మవిశ్వాసం కోల్పోడు.

శుభోదయం

రామ్ - 8096339900

www.ramkarri.com

నీ కోరిక భగవంతుడు

తీర్చాడు అంటే....

అతడి మీద నీ నమ్మకం పెంచుతున్నాడన్నమాట.

తీర్చలేదూ అంటే ....

నీ మీద అతడికి నమ్మకం ఉన్నదన్నమాట.

రామ్ - 8096339900

www.ramkarri.com

# శుభోదయం

రామ్ - 8096339900

జీవితంలో నువ్వేదైనా చెయ్యాలని సంకల్పిసే....
అసలు నీకేం కావాలో ముందు తెలుసుకో,
లేకపోతే నీ ప్రయత్నం ఎప్పటికి విజయం సాధించదు.

అందనంత ఎత్తులో ఉంది
అందుతుందో లేదో అని
సందేహపడకు నువ్వు
తలచుకుంటే
ఆకాశాన్నే ఆటస్థలంగా
మార్చగలవు
సూర్యచంద్రులనే బంతులుగా
మార్చగలవు
నీకు కావల్సినదల్లా నీ మీద నీకు
సాధించగలను అన్న నమ్మకమే



www.ramkarri.com

ఎంత బాగా మనం .. పరాయివారితో..

అపరిచితులతో మాట్లాడుతామో.. అందులో

పదవ వంతు మన ఇంట్లోని వారితో మాట్లాడితే

మనిల్లె మనకు స్వర్గసీమ అవుతుంది ...!!!

# శుభరాత్రి

కార్య భారం మీద పడితే,

కాస్త నిద్దురకి ఓర్చుకో..

సాటి ప్రాణం పస్తులుంటే,

సగం తినటం నేర్చుకో..

అందరితో ప్రేమగా నడుచుకో

మల్లీ ఈదారిన వస్తావో లేదో..

మరు జన్మ ఉంటుందో లేదో..

రామ్ - 8096339900

రామ్ - 8096339900

ఎవరైనా ఒక గొప్ప లక్ష్యాన్ని సాధించినప్పుడు వాళ్లను అదృష్టవంతులని, వాళ్ల విజయం వెనుక ఉన్నది కేవలం అదృష్టమేనన్నట్లు మాట్లాడడాన్ని చూస్తుంటాం. వాళ్ల విజయం వెనుక ఉన్న కృషిని, కొత్తరంగంలో అడుగుపెట్టడానికి చేసిన సాహసాన్ని గుర్తించకుండా అదృష్టం ముసుగుకప్పేసి మాట్లాడుతుంటారు. నిజానికి అదృష్టం అనేది మనిషిలోని ధైర్యం, సాహసం, శ్రమ, పట్టుదల, సంకల్పబలం... మొదలైన లక్షణాలను ప్రతిబింబించే అంశం మాత్రమే. ఇవన్నీ ఉన్న మనిషి నిరాశపడకుండా, సమయాన్ని వృథా చేయకుండా కష్టపడతాడు కాబట్టి విజయం సాధించడం జరుగుతుంది. ఈ విషయాన్ని ఒక్కమాటలో చెప్పడానికి ' అదృష్టం సాహసవంతులనే వరిస్తుంది ' అన్నారు.



నిన్న గురించి భయపడే వాడు నేడు పోరాడలేడు

నేడు పోరాడలేని వాడు రేపు గెలవలేడు

గెలుపు కావాలనుకుంటే భయం వదిలేయాలి

భయం పోవాలంటే పోరాడితీరాలి

భయపడుతూ చేసే పోరాటం ఓటమి పాలవుతుంది

భయం వదలి పోరాడితే విజయమే నీ సొంతమవుతుంది

శుభోదయం

# శుభరాత్రి నేస్తం !



ప్రేమ నా మతం... స్నేహం నా అభిమతం
వెరసి... నేను చేస్తోన్న వెన్నెల సంతకం

రామ్ - 8096339900



www.ramkarri.com

# విజేత

ప్రోత్సాహం పొందిన వానికే -- ఉత్సాహముంటుంది

ఉత్సాహం ఉన్నవాని మనసే --ఉరకలు వేస్తుంది

ఉరకలు వేసిన వాడే -- పరుగులు తీయగలడు

పరుగులు తీసినవాడే -- లక్ష్యాన్ని చేరగలడు

లక్ష్యాన్ని చేరినవాడే -- విజేత కాగలడు



www.ramkarri.com

ప్రకృతిలో ప్రతి ఒక్కదానికీ తనకంటూ ఒక ప్రత్యేకత ఉంటుంది .ఒక కోడి ఆ సంగతి
తెలుసుకోకుండా నెమలి తనకంటే అందంగా ఉందని, నెమలి ఈకలు ఉన్నంత అందంగా
తన ఈకలు లేవని ఉడుక్కుంది .ఆ కోపంతో తన ఈకలను పీకేసుకుంది .అప్పుడు
ఏమవుతుంది? ఈకలు పీకిన కోడవుతుంది కాని నెమలి అయిపోతుందా? మనలో
ఉండే మంచి లక్షణాలకు మెరుగులు పెట్టి ప్రత్యేకత సంపాదించుకోవాలి. కాని,
ఉడుక్కుని మనలో ఉన్న సమర్థతను కూడా పోగొట్టుకోవడం మంచిది కాదు

రామ్ - 8096339900

www.ramkarri.com

www.ramkarri.com

శు
భో
ద
యం



జీవితం మహాసముద్రం లాంటిది,
అలలు లాగా సుఖ దుఃఖాలు
ఎగసెగసి పడుతుంటాయి.
అలలు ఎన్నడు తీరాన్ని చేరి
ఉండవు,
అలాగే నిజ జీవితంలో
దుఃఖాలు నిలిచిపోవు,
కాబట్టి ధైర్యం అనే తెరచాప
సహాయంతో సుఖ దుఃఖాలనే
ఈ సముద్రాన్ని దాటి జీవితం
అనే ఓడను గమ్యం చేర్చుకో,

www.ramkarri.com

రామ్ - 8096339900

మిత్రమా!!!